అంకితము

మా ఆవిడకి

# ప రి చ య ం

పాఠకులతో చేసుకునే ఈ పరిచయం ప్రస్తుత గ్రంథకర్తను గురించి మాత్రమే కాదు; ఈ సంపుటాన్ని తొలి పుష్పంగా అర్పిస్తున్న ఈ "నవ రచనావళి" గ్రంథమాలను గురించి కూడా. "నవ రచనావళి" గ్రంథమాలను ప్రచురిస్తున్నది "నవచేతనా ప్రచురణలు" అనే సంస్థ. ఈ ప్రచురణసంస్థ యాజమాన్యాన్ని పైన పేర్కొన్న గ్రంథమాలతో పాటు "నవ రచన" అనే ఒక సాహిత్య మాసపత్రికను కూడా ప్రకటించాలని ఉద్దేశం. మాసపత్రిక త్వరలో ప్రకటించే సాధ్యత కూడా లభించగలదని ప్రకాశకుల విశ్వాసం.

ఈ గ్రంథమాలలో తొలి పుష్పంగా తమ రచనల నొసగిన మిత్రులు శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు పాశ్చాత్య సాహిత్యంలో నిష్ణాత అంటే, వారికెరిగిన వారెవరూ ఎదురు చెప్పరు. వారు విద్యావ్యాసంగానికి ఆంగ్లదేశం వెళ్లి, మాతృభాషలోనే సాహిత్యరచన చేయాలనే దీక్షతో తిరిగి వచ్చారు. 1935-వ సంవత్సరంనుంచి నేటి వరకూ, అరుదుగా నైనా, అతి నిశితమైన వాస్తవికదృష్టిని, వైచిత్రితో కూడిన మానసికప్రవృత్తులను ప్రదర్శించే నికరమైన కథలు సృష్టించారు. వారి కథలు 'భారతి' పత్రికాముఖాన్ని ప్రచురణ పొందిన వెంటనే ఆధునిక సాహిత్యపరుల దృష్టి నాకర్షించి గౌరవపాత్రమైనాయి. వారి కథల ప్రథమసంపుటి మా గ్రంథమాలలో ప్రథమ ప్రచురణగా వెలివడుతున్నందున మా గ్రంథమాల కూడా సహృదయుల దృష్టిలో ఆదరణీయమూ, గౌరవపాత్రమూ కాగలదని ఆశిస్తాము.

"నవ రచనావళి" గ్రంథమాల నవ రచయితల ప్రతిభను— ముఖ్యంగా యువ రచయితల ఉత్సాహాన్ని—ప్రతిబింబించే ముకుర

ప్రాయంగా ఉపకరించాలనే ఆదర్శంతో ప్రారంభిస్తున్నాము. ఇంకా 'పాప', 'పఠాభి', తిలక్, అనిసెట్టి మొదలైన యువ రచయితల నవరచనలు ఈ గ్రంథమాల నలంకరిస్తాయి. సంపాదకుడు ఆకలితో, హర్షంతో, ప్రతిభావంతులైన యువ రచయితల సహకారం కోసం చేతులు చాపి, ఎదురు తెన్నులు కాచివుంటాడు. కథ, నాటిక, వ్యాసం, స్కెచ్, పద్యనాటిక,—విశిష్ట స్వతంత్రరచన, ఉత్తమ అనువాద రచన—నవరచనలోని వివిధ స్వరూపాలూ, విభిన్న నైపుణ్యాలూ ఈ గ్రంథమాల ఆదర్శంలో ప్రతిఫలితం కావాలని ఆశయం. ఈ ఆశయం నెరవేరడానికి రచయితలేకాక గ్రంథవిక్రేతలూ, పాఠకులూ, పోషకులూ అందరి సమాదరమూ, సహకారమూ హృదయపూర్వకంగా ఆసిస్తున్నాము.

మల్లవరపు విశ్వేశ్వరరావు
సంపాదకుడు:
"నవ రచనావళి" గ్రంథమాల

4/3, దేశిగన్ స్వామి వీధి
మైలాపూరు, మద్రాసు

# విషయాలు

# జేబురుమాలు

1

"ఏమిటి నువ్వుకుట్టున్నది, పద్మినీ?"

"జేబురుమాలు."

"ఎవరికి?"

"ఎవరికేమిటి? నాకే."

"చాలా బాగుందె గుడ్డ. పట్టుగుడ్డేనా?"

"పట్టే అనుకుంటాను. క్రేప్ డి చైన్ అనో, క్రేప్ డి షైన్ అనో అంటారు. నీ చేతిలో ఏమిటా పుస్తకం?"

"ఇదా? అబ్బే...ఏమీ లేదు."

"అయినా చూపించు."

"పద్మినీ, ఈవాళ నీ పుట్టినరోజు కాదూ?"

"ఎవరు చెప్పేరు నీకు?"

"నా కలా జ్ఞాపకం..."

"ఆ పుస్తకం ముందు చూపించు."

"ఇవాళ నీ పుట్టినరోజైతే చూపిస్తాను."

"ఇవాళే నా పుట్టినరోజు."

"అయితే ఇదిగో."

"ఏమిటిది, చిట్టిశాస్త్రీ? నాకిది పుట్టినరోజుకి బహుమానమా?"

"అత్తకీ, మామకీ చూపించకుండా నీపెట్టెలో దాచెయ్యాలి నువ్వు."

"వాళ్లు చూస్తే ఏమిటి?"

"వాళ్లేమైనా అనుకుంటారు...పైగా నాకు సిగ్గు కూడాను."

"సిగ్గెందుకూ?......చిట్టిశాస్త్రి; నీ పుట్టినరోజెప్పుడు?"

"ఎప్పుడైతే నీకెందుకులే......పై చదువులకి నువ్వు చెన్నపట్టణం వెళ్లడం నిశ్చయమేనా?"

"అమ్మా నాన్నా ఇంకా వాదించుకుంటున్నారు. నాన్నకి పంపించాలనుంది. అమ్మకి అంతగా ఇష్టంలేదు.... ఈ పుస్తకం బాగుండేటట్టుంది. ఎంత దీని ఖరీదు?"

"ఎంతైతే నేమిటి?"

"ఇక్కడే వ్రాసిపెట్టేరు. పదున్నర రూపాయిలు. అబ్బా! ఎందుకింత ఖర్చుపెట్టేవు?....పోనీ, నీ పుట్టిన రోజెప్పుడో చెప్పు."

"అత్త నువ్వు చెన్నపట్టణం వెళ్లకుండా ఏమిటి చెయ్యాలంటుంది?"

"ఏమిటేమిటో అంటుంది."

"నాకు తెలుసునులే."

"ఏమిటి?"

"నీకు పెళ్లి చేసెయ్యాలనేనా?"

"అదంతా నీకెందుకు?....అతిప్రసంగం మాను ....నువ్వు చెన్నపట్టణం వెళ్లవా ఈసంవత్సరం?"

"నాకు వెళ్లాలనే ఉంది. అందులో ముఖ్యంగా నువ్వు అక్కడికి వెళ్లేటట్టయితే."

"నామాటకేమిలే."

"కాని మా అమ్మ నన్ను వదలిఉండలేనంటుంది. తనతో నేను చెన్నపట్టణంలో కాపురంపెట్టడం ఒట్టిమాట. డబ్బు హెచ్చు ఖర్చవుతుంది. అదికాక మాచెల్లాయికి పెళ్లి చెయ్యాలి. అమ్మా నేనూ కూడా చెన్నపట్టణంలో ఉండి పోతే సంబంధాలు వెతకడం కష్టం. నేనీ ఊళ్లోనే పడి ఉండటం నిశ్చయం....అన్నట్టు లక్ష్మీకాంతం అని నా స్నేహితుడొకడు చెన్నపట్టణం వెళ్తున్నాడు. నాబ్రతుకిక్కడే."

"మీ చెల్లికి అప్పుడే పెళ్లా?"

"పన్నెండేళ్లు నిండుతున్నాయి. దానికి చదువుకోవాలనీ లేదు. మాకూ అంతగా చదువుచెప్పించే శక్తీలేదు. నాన్నపోయి ఆరేళ్లయిందప్పుడే."

"ఇంత డబ్బుపెట్టి ఈ పుస్తకం ఎందుకు కొన్నావు, చిట్టిశాస్త్రి?"

"నువ్వు నవ్వనంటే ఒకసంగతి చెప్తాను."

"ఏమిటి?"

"ఆరునెలల బట్టి నా చిల్లరఖర్చుల కిచ్చే డబ్బంతా కూడబెట్టి కొనగలిగేను....పద్మినీ. ఎవరితోనూ చెప్పకు."

"నువ్వు చాలా తమాషామనిషివి సుమా....ఈ పుస్తకంమాట అమ్మకు తెలియకుండా ఎలా దాచగలను? అమ్మకి తెలియకుండా నేనేమీ ఇంతవరకు చెయ్యలేదు."

"చూపిస్తే మరేమీలేదు. నాకు సిగ్గుగా ఉంటుంది. అదికాక అత్తకి కొంత కోపంవస్తుందేమో అనికూడా భయం."

"చూపించనులే. దాచేస్తాను. కాని, నీ పుట్టినరోజు ఏదో చెప్పు. నీకుమట్టుకు నే నేదైనా ఇవ్వవద్దూ?"

"నాకేమీ అక్కరలేదు, పద్మినీ."

"చెప్పు! నేనుకూడా నీకొక పుస్తకం కొనివ్వనా? లేకపోతే మరొకటేమైనా కావాలా?"

"నాకేమీ వద్దు. నన్ను నువ్వు మరచిపోకుండా ఉంటేచాలు."

"చాలా విచిత్రంగా మాట్లాడుతున్నా వివాళ నువ్వు. నిన్నెందుకు మరచిపోతాను నేను?"

"నువ్వు చెన్నపట్నం వెళ్లిపోతున్నావంటే నాకు చాలా దుఃఖంగా ఉంది. పద్మినీ. ఏడాదిలో ఎప్పుడో కాని నిన్ను నేను కలుసుకోడం ఉండదు....సరే, కొంతకాలానికి నీకు పెళ్లికూడా అయిపోతుంది. ఆతర్వాత నిన్ను చూడడమే దుర్లభం అవుతుంది."

"పెళ్లి పెళ్లంటూ వెందుకు? దానిగురించి నువ్వు మాట్లాడకు....నీ కేమికావాలో నిజంగా చెప్పు. నే నిస్తాను. పుట్టినరోజుకే అని కాదులే. ఏమిటి కావాలి?"

అదికాక ఈ సగిపీపనంతా చాలా చికాకైనపని. నాకు సామాన్యంగా ఇటువంటి పనులకి తగినంత ఓపికకూడా లేదు.''

''నువ్వు జేబురుమాలు కుట్టి నాకిస్తానంటేనే నాకెంతో సంతోషంగా ఉంది. వేరే కుట్టి ఇవ్వనవసరం లేదు. ...నిజంగా. నేనంటే నీకు కొంచెమైనా అభిమానముందా, పద్మినీ ?''

''ఏమిటి, ఈవాళ నాతో ఇంతవిచిత్రంగా ప్రవర్తిస్తున్నావు ?....నా మేనత్తకొడుకు వైనప్పుడు నీమీద అభిమానం ఉండకేంచేస్తుంది ?''

''మేనత్తకొడుకు నవడంవల్ల నేనా నీ అభిమానం అంతా ?''

''అదేకాదు, చిట్టిశాస్త్రీ ! నువ్వు ప్రత్యేకంగా కూడా నచ్చావు. సావిత్రత్తకొడుకు లక్ష్మీనారాయణ కూడా నాకు మేనత్తకొడుకే. అయినప్పటికీ అతనంటే నాకంత అభిమానంలేదు.''

''వాడు, సరే, ఒట్టి పోకిరీవెధవ. వాడికంటె నేనంటేనే నీకు ఎక్కువ అభిమానం అని నన్ను సంతోషించమంటావా ?''

''నాకిదేమీ బోధపడడంలేదు. కాని నువ్వు చాలా మంచివాడవని నాకు తెలుసును. నా పుట్టినరోజుకి ఇది కొని నాకివ్వాలని నీ కెందుకు బుద్ధిపుట్టింది ?....చిట్టిశాస్త్రీ, నిజంగా నువ్వంటె నాకు చాలా అభిమానం. నిజంగా. ఈ

జేబురమాలు నగిషీఅంతా పూర్తికాగానే నీకిస్తాను. ఏమి? ...ఈ పుస్తకం దాచేస్తానులే. భయపడకు."

## 2

రెండేళ్ల తర్వాత:

"ఈ కుట్టుపనులంటే మీకు చాలా సరదాయేనా!"

"సరదాయేనండీ. కాని చాలాకాలంబట్టి ఏమీ చెయ్యడంలేదు. నిన్ననే మొదలుపెట్టేను. ఏమీతోచక. నాకంత ఓపికలేదండీ. మీరే మీ ఓపికతో ఆడజన్మ ఎత్తుంటే ఇటువంటి కుట్టుపనులూ, నగిషీపనులూ ఎన్నో చేసుందురు."

"రమారమి రెండుసంవత్సరాలు మనం ఒకేకళాశాలలో ఒకేతరగతిలో ఉన్నాంకదా. ఇంకా మీరు నన్ను 'మీరూ మీరూ' అనడం న్యాయమేనా? 'లక్ష్మీకాంతం' అంటూ ఉండండి. 'లక్ష్మీకాంతంగారూ' అంటే నాకు నచ్చడంలేదు."

"నన్ను మీరు 'మీరూ' అనడం లేదూ? అలాగే."

"మీ విషయంలో వేరు. మీరు ఆడవారు. మర్యాద చెయ్యవలసిన బాధ్యత నాకుంది."

"స్త్రీపురుషులు సమానులనే రోజులుకదా ఇవి, నాకుమట్టుకు మర్యాదలెందుకు? అదికాక నా పేరుకొకతోకపెట్టి 'పద్మినిగారూ' అన్నా 'పద్మినీదేవి గారూ' అన్నా వినడానికి చాలా అసహ్యంగా ఉంటుంది. సాధారణంగా

'పద్మిని' అంటే ఆపేరులో అందంఉంది. ఒప్పుకుంటారా?"

"పేరులో మాత్రమే కాదు."

"మీరిలా కొంటెతనపుమాటలాడడం నా కిష్టం లేదు. ఎవరైనా వింటే బాగుండదు. అనేకమంది ఇలా వస్తూపోతూ ఉంటారు. అదీకాక ఆ మూలకూర్చున్న పిల్ల మనమాటలన్నీ వింటోందని నా అనుమానం....వద్దు, వెనక్కి తిరిగి చూడకండి. నెమ్మదిగా మాట్లాడండి."

"నాకింకా మర్యాదలుచెయ్యడం మానననంటారు?"

"ఈరోజు ఈవిధంగా నడవనియ్యండి."

"సరేలెండి. ఈసాయంత్రం ఇక్కడికి నన్ను రమ్మని మీరు కళాశాలలో చెప్తే ఏదో ప్రత్యేకమైన కారణం ఉందనుకొన్నాను."

"ఏమీ లేదండీ. నాకేమీ తోచడంలే దిక్కడ.... అదీకాక నిన్నరాత్రిబట్టీ నా మనస్సు చాలా చికాకుగాఉంది. నిన్న సాయంత్రం నా గదిలోఉన్న పిల్ల నాతో పోట్లాడింది. చీటికీమాటికీ పోట్లాడుతుందా పిల్ల. కోపంలో నా చీరెఒకటి చింపేసింది."

"నిజంగా?"

"అవును. కాని నేనుమట్టుకు ఊరుకునే రకం కాను లెండి. తన పెట్టెలోంచి క్రొత్తచీరెఒకటి పైకిలాగి దాన్ని నేను చింపేసేను. దానితో ఇద్దరం ఏడుస్తూకూర్చున్నాం... ఎందుకలా మాట్లాడకుండా చూస్తారు? ఇప్పుడిల్లా నవ్వుతూ చెప్తున్నాననా? తర్వాత ఇద్దరం మళ్లీ స్నేహితురాళ్ల మయి

పోయేవాళ్ళం లెండి. ఆడవాళ్లం అందరం చాలా విచిత్రమయిన జంతువులమని ఒప్పుకుంటారా?"

"మీరు అవిడ ఉన్న గది వదిలి వేరేగదికి వెళ్లకూడ దండీ?...కొందరి కొందరి స్వభావాలు అలాగే ఉంటాయి లెండి. ఆడవాళ్లలోనే కాదు, మగాళ్లలో కూడా. క్రిందటి సంవత్సరం నేనున్న గదిలో ఒకడుండేవాడు. వాడుకూడా..."

"నిన్న రాత్రి ఆగది వదిలెయ్యాలనే అనుకున్నాను. కాని ఇప్పుడింక వదలనక్కరలేదు...మిమ్మల్ని రమ్మని ఇక్కడ నేను చెప్పకబట్టే చూడండి? ఈ దరిద్రపు ఘోషంతా మీతోనే నెందుకుచెప్పాలి. చెప్పండి!"

"అలా అనకండి. మీరు నాతో ఎంత చనువుగా ఉంటే నాకంత సంతోషం...నేను మీతో ఇంతవరకు చెప్పలేదు. మూడునాలుగు సంవత్సరాలబట్టి రాత్రింబగళ్లు నా ఆలోచనలు సగం మిమ్మల్ని గురించే. రాజమహేంద్రవరంలో మీరు చదువుకుంటున్న రోజుల్లో పురుషోత్తం మీమాటలు చెప్తున్నప్పుడు...."

"మా చిట్టిశాస్త్రి?"

"అవునండీ. మేము అందరం 'పురుషోత్తం' అనే పిలుస్తూఉండేవాళ్లం లెండి ...పురుషోత్తం ఏమిటేమిటో మిమ్మల్ని గురించి చెప్తున్నప్పుడు ఎప్పటికైనా మిమ్మల్ని కలుసుకోవాలనీ మీతో మాట్లాడాలనీ నాకుండే అభిలాష ఇంతాఅంతా అని చెప్పనలవి కాదు."

"నిజంగా?"

"నిజంగా. మీరు పిక్చర్లకి వెళ్ళేచోటికి నేనుకూడా వెళ్తూఉండేవాడిని, ఊరికే మిమ్మల్ని చూడడానికే. మీరు సినీమాకికాని నాటకానికికాని వెళ్తున్నారని తెలిస్తే నేను కూడా అక్కడ తయారయేవాడిని, మిమ్మల్ని దూరాన్నించి చూసి సంతోషించడానికే."

"నా కారోజులలో మీరంటూ ఒకరున్నారన్న మాటె తెలియదు."

"మీకు తెలియడానికి అవకాశం ఏదీ? నా అదృష్ట వశాత్తు మనంఇద్దరం ఒకేకళాశాలలో ఒకేతరగతిలో ఉండడం సంభవించింది. దానికితోడు మీరు చెన్నపట్టణం వచ్చిన కొన్నినెలలకే మీ తండ్రిగారు నేను రాజమహేంద్ర వరంనుంచి ఇక్కడికి వస్తుంటే మీకు అందజేయమని నా కేవో కొన్ని వస్తువులిచ్చారు. ఆ సమయంలో నా ఆనందానికి మేర లేదు. నేనారోజున ఇక్కడికి ఆ వస్తువులు పట్టుకురా వడం, మీకు కబురుపంపడం, మీరు క్రిందికి దిగిరావడం, ఆతర్వాత మనకి జరిగిన సంభాషణా నేను ప్రాణంఉండగా మరచిపోలేను."

"నాకూ బాగా జ్ఞాపకముంది సుమండీ. మీరు వస్తారని నాకు మానాన్న ముందరరోజునే వ్రాశాడు. ఆ సాయంత్రం మీకోసం ఎదురుచూస్తూ ఉన్నాను."

"నాకోసం కాదు. ఆ వస్తువులకోసం అనండి."

"లేదు, మీకోసంకూడా....మీకోసమే."

"తర్వాత మిమ్మల్ని చూడడానికి నన్ను తరుచుగా మీరు రానివ్వడం మీ దయా నా అదృష్టమూను."

"మీరు నమ్ముతారో నమ్మరో కాని మీరు ప్రతి శనివారం రావడం నాకెంతలవాటయి పోయిందంటే మీ రెప్పుడైనా రాకపోతే నాకేమీతోచదు. ఆ సాయింత్రం అంతా నాకు తలనొప్పిగాఉంటుంది."

"నిజం చెప్తున్నారా?"

"నిజమేనండీ....అన్నట్టు క్రిందటివారం మీరు నా కిచ్చిన పుస్తకం చదివానుసుమండీ. చాలాబాగుంది."

"నేను చెప్పేనుకాదండీ. చాలాబాగుంటుంది. మొన్న మొన్నటి వరకూ ఆ గ్రంథకర్త పేరుకూడా నాకు తెలియదు. మధుసూదనరావు, మనతరగతిలోనే ఉన్నాడు చూడండీ..."

"ఎప్పుడూ మీపక్కని కూర్చుంటాడు, అతనేనా?"

"అవునండీ. అతనే. చాలా తెలివైనవాడు. నేనూ అతనూ చాలా స్నేహితులంలెండి. అతను చెప్పేడు ఈ గ్రంథకర్తగురించీ ఈ గ్రంథంగురించీ."

"చాలా తెలివైనవాడా అండీ అతను?"

"అవునండీ, చాలా తెలివైనవాడు."

"తరచుగా మీరు అతనితోనే తిరుగుతూ ఉంటారు కాబోలు."

మిమ్మల్ని చూడడానికి రాని సాయింత్రాలన్నీ అతని తోనే గడుపుతాను. చాలా చమత్కారంగా మాట్లాడు తాడులెండి."

"ఊరికే పైనుండి చూసినవాళ్ళకి అంత తెలివైన వాడిలా కనబడడే!"

"అవును. చాలామంది అలా అన్నారు. మనిషికి అమితమైన సిగ్గు. బాగా ఎరుగున్నవాళ్ళదగ్గరకాని తెలివి తేటలు తెలియపరస్తూ ప్రవర్తించడు.... ఈవాళ నేను వస్తానంటే వేళాకోళానికి తననికూడా మీదగ్గరకి తీసుకువచ్చి మీతో పరిచయం కలపమన్నాడు."

"తీసుకు రాలేకపోయారా?"

"తీసుకు రమ్మంటారా? ఈసారి తీసుకువస్తాను లెండి."

"అన్నట్టు మీరు వెళ్ళిపోయే వేళయింది. మీ పుస్తకం తెచ్చి ఇచ్చేస్తాను."

"వద్దండీ. మీకంత నచ్చిందికనుక మీదగ్గరే ఉంచుకోండి. బహుమానంగా ఇచ్చాననుకోండి. నేను చదివేకే మీకిచ్చాను కాని...."

"బహుమానంగా ఇచ్చేస్తానంటారా? అంతడబ్బు పెట్టి కొనుక్కున్నారు! నాకు చాలా నచ్చిందనుకుండీ ఆపుస్తకం. మరి దానిని నాకు మీరు బహుమానంగా ఇస్తే మీకు నన్నేమిటిమ్మంటారు?"

"నాకు మీరేమీ ఇవ్వక్కర్లేదండీ. నామీద దయ ఉంచితే చాలు."

"అలాకాదు. మీకు ఏగ్రంథకర్త అంటే ఎక్కువ అభిలాషో చెప్పండి. నేనొక పుస్తకం కొని మీకిస్తాను."

"నాకు పుస్తకాలొద్దండీ."

"మరేమి టిమ్మంటారు....పోనీ, నేనిప్పుడు కుట్టున్న జేబురుమా లిమ్మంటారా?"

"ఆగుడ్డ చాలా బాగుందిసుమండీ. ఏమిటండాగుడ్డ?"

"క్రీప్ డి చైన్ అనో క్రేప్ డి షైన్ అనో అంటారండీ. నిన్ననే మొదలుపెట్టేను ఏమీతోచక. ఒకవైపు పూర్తిగా అయింది. మరొకవైపు సఖంకూడా కాలేదు. మిగిలిన రెండువైపులూ నగిషీపని మొదలుపెట్టనే లేదు...ఈ జేబురుమాలు పుచ్చుకుంటారా?"

"మీా ఇష్టం."

"నా ఇష్టం అనికాదు. కావలిస్తే మరేదైనా కొని ఇస్తాను."

"ఈ జేబురుమాలే కావాలండీ."

"అంతత్వరలో అయిపోదుసుమండీ. వెంటనే దీనిని నేను పూర్తిచెయ్యలేను. అది కాక ఈ నగిషీపనంతా చాలా చికాకైనపని. నే నిదివరకే అన్నాను, నాకు సామాన్యంగా ఇటువంటిపనులకి తగినంత ఓపిక లేదని.

"సావకాశంగా కానివ్వండి. తొందరేమిటి? మీారు జేబురుమాలు కుట్టి నాకిస్తానంటేనే నాకెంతో సంతోషంగా ఉంది. నిజానికి వేరే కుట్టి ఇవ్వనవసరం లేదు."

"అలా అనకండి. మీారు అంతఖరీదైన పుస్తకం కొనుక్కుని నాకిచ్చేసినందుకు నేను కృతజ్ఞత చూపించనక్కర లేదూ?"

"అంత కృతజ్ఞత కేముందండీ? మీారేమి చెయ్యమన్నా చేసేందుకు సంసిద్ధుడనేకా!"

"అయితే వెళ్లిపోతారా?...మళ్లీ సారి మీరు వచ్చే టప్పుడు మీ స్నేహితుడిని పిలుచుకువస్తారు కాదూ?"

"మధుసూదనరావునా? తప్పకుండా తీసుకువస్తానండీ. శలవు."

"శలవు."

## 3

మరొక రెండేళ్ల తర్వాత :

"ఈవేళ నన్ను ప్రత్యేకంగా రమ్మనికూడా నీ కుట్టుపనే నువ్వు చేస్తూ కూర్చుంటే నిన్ను చూస్తూ ఆనందించమనా నీ ఉద్దేశ్యం, పద్మినీ?"

"లేదు, మధూ. అంత కోపం తెచ్చుకోకు. ఈపని మానెయ్యమంటే మానేస్తాను. రెండేళ్లబట్టి ఏమీ చెయ్యడం లేదు. నిన్ననే మొదలుపెట్టేను ఏమీతోచక....... మానెయ్యనా?"

"అది మానెయ్యక్కర్లేదు. ఏమైనా మాట్లాడు."

"ఏమిటి మాట్లాడమంటావు? నీ చిన్నచిన్న బాధలన్నీ వరుసగా చెప్పి నువ్వు చికాకు పడిపోతున్నావు కాని, నువ్వు కొద్దిరోజులలో సీమవెళ్లిపోతానని చెప్పినప్పటినుంచీ నేనెంత దుఃఖపడుతున్నానో నువ్వు ఆలోచించడం లేదు."

"అంత దుఃఖపడవలసిన కారణం ఏమిటి?"

"ఏమీ బోధపరుచుకోలేవు కాదూ నువ్వు?.... నిన్ను మళ్లీ ఎప్పుడుచూస్తానో, మధూ! తిరిగివచ్చాక నన్ను చూస్తావో లేదో కూడా."

"చూడకేంచేస్తాను?"

"ఏమో! అప్పుడు నిన్ను 'మధూ' అని పిలిచేందుకు కూడా అర్హత నాకుంటుందో లేదో. మళ్లీ మధుసూదన రావుగా మారిపోతావేమో నువ్వు. కనబడకుండా మాయమైపోతావేమో కూడా."

"తిరిగి వచ్చేసేక మాట అలా ఉండనీ, పద్మినీ. 'ఆ దేశాలలో నా కార్యం ఎంతవరకు సాధించగలుగుతానా?' అని బెంగపెట్టుకున్నాను. నాకున్న ఆస్తంతా ఈ సీమ ప్రయాణంమీదా ఈ సీమ చదువుల మీదా పోస్తున్నాను. నెగ్గకపోతే చావడమే మేలు."

"అలా అనుకోకు, మధూ. నువ్వు చాలా తెలివైన వాడివి. నీకు తెలియదూ ఆమాట?"

"తెలియక కాదు. భయం. అధైర్యం......తీరా వచ్చాక నాకు ఉద్యోగం దొరుకుతుందో దొరకదో అని ఇప్పటినుంచీ బాధ."

"వాటిగురించి ఇప్పటినుంచీ ఆలోచించకు, మధూ ...నీ దూరబంధువు డెవడో సీమలో కలెక్టరీ పరీక్షలో ఉత్తీర్ణుడయాడని చెప్పేవుకాడూ?"

"అవును. కృష్ణశాస్త్రి అని మావాడే."

"చూడు. అటువంటివాళ్లె సంగతి ఆలోచించుకో."

"అసలు కృష్ణశాస్త్రే నన్ను సీమకి రమ్మని ప్రోత్సాహించినది. అతని సలహామీదనే బయలుదేరుతున్నాను. ఒక సోదాది ఇంకా అక్కడ ఉండాలి. నా సంగతంతా

ఆలోపున చక్కబెట్టానన్నాడు."

"ఏడాదయేవరకూ ఆయన ఈ దేశం రారన్నమాట."

"రాడు."

"బాగానే ఎంతజీతం ఇస్తారో ఆయనకి?"

"నాలుగువందలో అయిదువందలో."

"అలాగా!"

"మరేమిటనుకున్నావు?...నా భవిష్యత్తంతా ఏలా ఉంటుందో అని భయంగాఉంది, పద్మినీ."

"భయపడకు, మధూ. నీకుమట్టుకు అంత అదృష్టం పట్టదన్నమాటేమిటి?...ఇంతకీ, మధూ, నీబాధతో ఆలోచించుకుంటున్నావు కాని నామాట నువ్వు తలపెట్టడమే లేదు."

"నన్నేమిటి చెయ్యమంటావు మరి? నా జీవితం అంతా ఎంత గందరగోళంగా ఉందో చూడు."

"జ్ఞాపకంఉందా నువ్వు ఆరు నెలలక్రిందట నా కిచ్చిన మాట?...మరచిపోకూడదు సుమా!"

"మరచిపోను, పద్మినీ. కాని..."

"నిన్ను మొదట చూసినప్పుడే నువ్వంటే నాకెంతో మంచిఅభిప్రాయం కలిగింది. నీతో ఎక్కువపరిచయం సంపాదించాలని నేను పన్నిన పన్నాగాలు ఇన్నీఅన్నీ కావు. 'నేను చేసేపనులు లోకంలో మర్యాదస్థురాళ్లు చేసేపనులా కావా?' అనికూడా ఆలోచించుకోకుండా ప్రవర్తించాను. నన్ను మోసపుచ్చడం న్యాయంకాదు."

"నిన్ను మోసపుచ్చను...కాని, ఈ మాత్రం నువ్వు బోధపరచుకో లేవూ? ఇప్పుడు నా చదువులే నాకు ముఖ్యం. మరే సంగతులూ ముఖ్యం కాదు..."

"నువ్వు నాకు చేసిన వాగ్దానం కూడానా?"

"అది కూడా."

ఇలా ఎప్పుడో ఒకప్పుడు నాతో అంటావని నే నెప్పుడూ భయపడుతూనే ఉన్నాను."

"నీమీద నాకు ప్రేమ లేక కాదు, పద్మినీ...మరి, నీకు నేనెలా బోధపరచగలను?"

"నువ్వు నన్ను మొదటిసారి చూడడానికి రావడం నీకు జ్ఞాపకం ఉందా?"

"జ్ఞాపకం లేకేమీ?"

"నీ స్నేహితుడితో?"

"అవును. లక్ష్మీకాంతంతో."

"ఆ రాత్రంతా నేను నిద్రపోలేదు, తెలుసునా? నిన్నుగురించే ఆలోచిస్తూ ఉన్నాను."

"నేనూ ఆ రాత్రి చాలా సేపటివరకూ నిద్రపోలేదు ...కాని, ఆ రోజుల ప్రశంస ఇప్పుడెందుకు పద్మినీ? అప్పటికీ ఇప్పటికీ యుగాలు జరిగిపోయినట్లు అనిపిస్తుంది నాకు."

"ఏడాదిపైన పదినెలలుకూడా కాలేదు!...నువ్వు నాతో ఇంత నిర్లక్ష్యంగా మాట్లాడినప్పుడు నాకు ఏడుపు పర్యంతం వస్తుంది...మధూ, ఆ దేశాలలో ఆడవాళ్ళతో స్నేహం చెయ్యనని వాగ్దానం చెయ్యవూ?"

"ముసలివాళ్లైనా కూడానా?"

"ముసలివాళ్లైనా కూడా?"

"సరే వాగ్దానం చేసేను. ఇంకా ఏమిటి వాగ్దానం చెయ్యమంటావు చెప్పు."

"ఎంత వేళాకోళంగా ఉంది నీకిదంతా!...మధూ, నువ్వు నన్ను మరచిపోతే నా జీవితంలో సుఖం, ఆనందం చచ్చిపోతుంది. నువ్వు తప్పకుండా నన్ను మరచిపోతావని నాకు తెలుసును."

"నా జ్ఞాపకశక్తి అంత తృణీకరించవలసినది కాదు ...నిన్ను మరచిపోను, పద్మినీ, ఎలా మరచిపోగలను?"

"నన్ను ఓదార్చడానికి అంటున్నమాటలవి. నిజంగా నీకు నేనింక అవసరంలేదు. నీ చదువులూ నీ భవిష్యత్తూ నీకు ఎక్కువముఖ్యం అయిపోయాయి. ఒకానొక కాలంలో నా అవస్థ అంత అన్యాయంగా ఉండేదికాదు. వాటన్నిటి కంటే నేనే ఎక్కువ ముఖ్యంగా ఉండేదాననని."

"ఇప్పుడూ నువ్వే నాకు ఎక్కువ ముఖ్యం, పద్మినీ. కాని ఈ ప్రత్యేకసమయంలో నేను నా స్వంతవిషయాల గురించి బెంగపెట్టుకోడం అసందర్భం అంటావా? ఇప్పుడు కాకపోతే ఎప్పుడు వాటిగురించి ఆలోచించడం?"

"కాని నా మాటే ఆలోచించడం లేదు నువ్వు"

"మూడు వారాలక్రిందట నీ పుట్టినరోజుకి నేను పంపిన పుస్తకం అందిందా?"

"అన్నట్టు దానిమాటే చెప్పడం మరచిపోయాను!

అందింది, మధూ. పుస్తకం చాలా బాగుంది. అప్పుడే రెండు సార్లు చదివేను...ఈ వాళ నువ్వు రాగానే చెప్దాం అనుకుంటూనేగూ మరచిపోయాను. క్షమించు మధూ.''

''చూసేవా మరి! నేను నిన్ను మరచిపోతున్నానో నువ్వు నన్ను మరచిపోతున్నావో తెలుసుకోడానికి ఇదే ఋజువు.''

''నువ్వు నీ మాటలధోరణిలో పడేసరికి వింటూ నామాట మరచిపోయాను...అవును, నాదే తప్పు.''

''ఎప్పటికీ నిన్ను పూర్తిగా మరచిపోలేనని ఇప్పుడైనా ఒప్పుకుంటావా?''

''పూర్తిగా మరచిపోవులే...ఇదే మొదటిసారి నా పుట్టినరోజుకి నువ్వు బహుమానం ఇవ్వడం, ఇదే ఆఖరిసారి కూడా అనుకుంటాను. అంతేనా?''

''ఓపికపట్టి చూడు. ఇప్పటినుంచీ ఆశలూ అనుమానాలూ ఎందుకు?''

''ఎంత అడిగినా నీ పుట్టినరోజు ఏదో నువ్వు నాకు చెప్పలేదు, మధూ.''

''ఎందుకూ?''

''నాకుమట్టుకు ఆ రోజున నీ కేదైనా ఇవ్వాలని ఉండదూ?''

''నేను నీకిచ్చేను కనుక నువ్వుకూడా నాకివ్వాలా!''

''అంతేకాదు కారణం...నీ పుట్టిన రోజు ఏదో చెప్పు.''

"చెప్పను."

"ఈ చిన్నచిన్న విషయాలలో చాలా క్రూరత్వం చూపిస్తావు నువ్వు... చెప్పు."

"అసలు సంగతి, నాకే తెలియదు, పద్మినీ. మారుమూలని పల్లెటూరులో పుట్టేను. అక్కడ వాళ్ళకి తిథులు తెలుసును కాని తేదీలు తెలియవు. నేనుకూడా అంత పట్టుదలగా తెలుసుకుందామని ప్రయత్నం చెయ్యలేదు. తప్పరోజు ఏదైనా చెప్పమంటే చెప్పగలను...పుట్టేము చాలదూ? ఏరోజో కూడా ఎందుకు జ్ఞాపకం ఉంచుకోడం?"

"పోనీ, అటువంటి కారణం లేకుండానే నీకేదైనా బహుమానం ఇస్తాను. నీకేమి కావాలో చెప్పు."

"సరే, నువ్వు కుట్టున్న జేబురుమాలు కావాలి. నగిషీలన్నీ చేసేక, కుట్టడం పూర్తయాక నాకియ్యి."

"ఇది నీకు నచ్చిందా?"

"గుడ్డ చాలా బాగుంది. ఏమిటి దానిపేరు?"

"క్రేప్ డి షైన్ అనో క్రేప్ డి షైన్ అనో అంటారు. నిన్ననే మళ్లీ మొదలుపెట్టేను, ఏమీ తోచక. రెండు వైపులు పూర్తిగా అయాయి. మూడవవైపు నగిషీ సఖం కూడా కాలేదు. ఇంకా ఆఖరివైపు పని మొదలుపెట్టాలి... నిజంగా ఈ జేబురుమాలే కావాలంటావా?"

"నువ్వు మరొకనికోసం కుట్టుంటేతప్ప."

"ఎవరికీ కాదు. మొదలుపెట్టినప్పుడు నువ్వు పుచ్చుకుంటావేమో చూద్దామన్న ఆశతోనే మొదలుపెట్టేను..."

వెంటనే దీనిని పూర్తిచేస్తానని మాటివ్వలేను సుమా. ఈ నగిషీపనంతా చాలా చికాకైనపని. నాకు సామాన్యంగా ఇటువంటి పనులకి తగినంత ఓపికకూడా లేదు.''

''పోనీ, నేను సీమకి బయలుదేరే లోపుగా తయారవుతుందంటావా?''

''మూడ్నెంతులు తయారవుతుంది. లేకపోతే, నువ్వు అక్కడికి వెళ్లేక పంపిస్తాను....సీమలో ఉన్నంతకాలం ఈ జేబురుమాలు ఎప్పుడూ నీ కోటుపై జేబులో పెట్టుకు తిరుగుతానని నాకు వాగ్దానం చెయ్యి. మధూ.''

''మరి దాన్ని చాకలివాడికి వేసిన రోజులలోనో?''

''నేనంటే నీకు పరమ వేళాకోళం కదా!''

''లేదు, పద్మినీ. ఎప్పుడూ పెట్టుకుంటాను...అసలు నువ్వు పంపించడం అంటూఉంటే! నా కిస్తాననడమే చాలు, పంపించినా పంపించకపోయినా!''

''పంపకేం చేస్తాను?...వెళ్తావా అయితే?''

''వెళ్తాను. మళ్లీ ఒకసారి సీమకి బయలుదేరేముందు వస్తాను.''

# 4

మరొక రెండేళ్లతర్వాత:

''ఓహో, పెళ్లికూతురుగారు ఈమూల కూర్చుని ఏదో కుట్టుకుంటున్నారా?''

''పెళ్ళయిపోయి వారంరోజు లయినాకూడా ఇంకా పెళ్లికూతురునేనా?''

"నిన్ను ఏమని పిలవాలో నాకింకా తెలియడంలేదు. ఈ దేశంలో పెళ్లాలని పిలవడం గొప్ప చిక్కు. 'పద్మినీ' అని పిలుద్దాం అంటే అందరూ నిన్ను ఆ పేరు పెట్టే పిలుస్తారు. నా ప్రత్యేకభావాలకి ఆ పేరు పనికిరాదు. పాశ్చాత్య పద్ధతులు అవలంబించి 'ప్రేయసీ' అనికాని 'ప్రియురాలా' అని కాని పిలవాలంటే నా సిగ్గుమాట అటుండగా అటువంటి పలుకరింపులు వింటే కొందరికి పొట్ట బద్దలయ్యేటట్టు ఏడుపు రావచ్చును! ఏమంటావు?"

"ఈ నవ్వులూ ఈ ఏడుపులూ ఎందుకు తెచ్చిపెట్టుకోడం? మానెయ్యండి."

"నన్ను 'మీరూ' అనికాని వేరేవిధంగా పిలువవంటావు?"

"ఏమని పిలువమంటారో చెప్పండి."

" 'నువ్వూ' అని పలుకరిస్తే తప్పేమిటి?"

"నాకు తెలియదు."

"మిగిలిన వాళ్లున్నప్పుడు 'మీరూ, మీరూ' అని అంటే అన్నావుకాని, మనం ఇద్దరమే ఉన్నప్పుడైనా మరోకలా పిలువకూడదూ?"

"ఒకప్పుడు ఒకలా పిలిచి మరొకప్పుడు మరొకలా పిలువడం నాకు చేతకాదు. కొంపతీసి పొరపాటున మనిద్దరమే ఉన్నప్పుడు 'మీరూ' అని పిలిచి మిగిలినవాళ్లున్నప్పుడు మరొకలా పిలుస్తానేమో!"

"అలా అయినా ఫరవాలేదు...నిజంగా, చూడు.

పిలిస్తే 'కృష్ణా' అని పిలువవచ్చును. లేకపోతే 'శాస్త్రీ' అని పిలువవచ్చును. సులభంగా ఉచ్చరింపదగినవి రెండు చిన్నపేర్లు నాకున్నాగూడా వాటిని నువ్వు ఉపయోగించకుండా ఉండడం మంచిపని కాదు."

"మీరు పట్టుకున్న ఉత్తరం ఎవరి దగ్గరనుంచి?.... లేకపోతే నేను అడుగకూడదా?"

"నీకు చూపించాలనే తీసుకవచ్చాను. నాకు మధుసూదనరావని ఒక దూరబంధువు డున్నాడు. ఇప్పుడు సీమలో ఉన్నాడు. పాపం, ఈమధ్యనే అతని పరీక్ష పోయింది. కొన్నివారాల క్రిందట అతనికి మనపెళ్లిని గురించి వ్రాశాను. దానికి జవాబిది....కళాశాలలో ఉండగా నిన్ను ఎరుగుదునని వ్రాస్తాడేమిటి?"

"ఏదీ, ఇలా ఇవ్వండి....ఆయన పేరు?"

"మధుసూదనరావు."

"మధుసూదనరావా?....అవునవును, పట్టపరీక్షకి చదువుతున్నప్పుడు నా తరగతిలోనే ఉండేవాడు."

"పాపం, చాలా కష్టాలలో ఉన్నాడిప్పుడు. ఇంకా సీమలోఉండి చదివేందుకు నన్ను సహాయం చేసిపెట్టమంటాడు. నే నేమీ చెయ్యలేను."

"ఆ రోజులలో చాలా తెలివైనవాడని పేరు సంపాదించాడాయన."

"తెలివైనవాడే, అయితే నేమీ?....అక్కడికి వెళ్లేక చదువులుకూడా కొంత సన్నగిల్లేయనే నా అను

మానం. రాత్రింబొాగళ్లు చదివితేకాని ఏమీ రాదు. నే నీ ఉద్యోగంలో ఇప్పుడున్నానూ అంటే, ఎంత కష్టపడితే నాకు లభించిం దిది. అది గ్రహించరు చాలామంది.''

''ఆయన ధనవ్యయం, చదువులూ, అన్నీ వృథా అన్నమాటే ?''

''వృథాయే.''

''పాపం.''

''రేపు రాత్రికి నా స్నేహితుడు సంజీవరావు మనిద్ద రినీ భోజనానికి పిలిచాడు. ఇంకా ఎవరెవరినో కూడా పిలు స్తున్నానని చెప్పేడు. అతనిభార్య నీతో వచ్చి చెప్పిందా ?''

''చెప్పింది.''

''ఆవిడ నీకెలా నచ్చింది ?''

''నాకు నచ్చలేదు సుమండీ!''

''ఏమీ ?''

''ఆవిడ షోకులు చూస్తే నాకు అసహ్యాం. ఏమిటో తిప్పుకుంటూ నడుస్తుంది, వికారంగా మాట్లాడుతుంది. లోకం అంతా తనకేసే చూస్తోందన్నట్టూ, లోకం అంతా తనకేసే చూడాలన్నట్టూ ప్రవర్తిస్తుంది. నాకు నచ్చ దామనిషి.''

''నీకింకా ఎవరెవరిదగ్గర ఎలా ఉండాలో తెలియదు కాని, తెలిసేక ఆవిడని చూసి చాలా ఆనందిస్తావు. చాలా మంచిదావిడ. కొన్నిరోజులు పోయాక నువ్వే కనిపెట్టావు. ఊరికా సిగ్గుపడిపోయి అందరివెనకా గోడకి జార్లబడి నుం

చుంటే ఏమిలాభం? అందరితోనూ కలసిమెలసి తిరిగి ఎవరితో ఎలా మాట్లాడాలో అలా మాట్లాడుతూ ఉండాలి. నువ్వింకా నేర్చుకోవా లీ పద్ధతులన్నీ."

"నా కేమీ అక్కరలే దా పద్ధతులు."

'అక్కరలేదంటే ఎలాగ? ఆవిడతో స్నేహంచేసి ఈ విషయాలన్నిటిలోనూ తరిఫీజవుతా వేమో నని ఆశపడుతున్నాను నేను."

"నేనేమీ ఆవిడదగ్గర నేర్చుకోదలచుకోలేను."

"నేర్చుకోకపోతే వీలులేదు. ఊరికా చదువుకున్న దానవై ఉన్నంతమాత్రాన చాలదు. ఈ చిన్న చమత్కారచేష్టలలోనే మనిషి రాణించడం రాణించకపోడం బయులుపడుతుంది. తంటాలుపడి శ్రద్ధగా నేర్చుకుంటేనే కాని ఈ చేష్టలు పట్టుబడవు. రానురాను వాటి ఉపయోగం నువ్వే గ్రహిస్తావు."

"ఉన్నదానిని ఉన్నట్టుగా నచ్చకపోయాక...."

"నువ్వు నచ్చలేదని కాదు."

"మరి, మీరంటున్న మాటలన్నిటికీ అర్థం ఏమిటి? నాకంటె ఆవిడ మీకు ఎక్కువ నచ్చిందన్న మాట కాదూ?"

"అదేమన్న మాట! ఆవిడదగ్గర నువ్వు తరిఫీజయాక ఆవిడ తలదన్ని నువ్వే పైకొస్తావు..... రేపు భోజనానికి వెళ్ళేటప్పుడు మంచి రంగుపట్టుచీరె కట్టుకో. చాలా షోకుగా తయారవాలి నువ్వు."

"ఏ రంగులు మంచివో ఏ చీరెలు మంచివో నాకు తెలియదు. నా పెట్టె తీసి మీరే స్థిరపరచండి."

"నీకు చీరెకూడా నన్నే కట్టమంటావు కాబోలు!"

"వెంకితనం!...అవును మరి, అందంగా చీరె కట్టుకోడం నాకు తెలియదని నిశ్చయించుకు అదిగూడా మీరే కట్టాలనంటే, దానికి నేను ఒప్పుకోన వలసినదేకా?"

"నువ్వు కుట్టున్నదేమిటి?"

"కనబడడం లేదూ? జేబురుమాలు."

"నాకే కాదూ?"

"కాదంటేనో?"

"కాకుండా ఎలా ఉంటుంది? ఏమిటా గుడ్డ? తమాషాగా ఉంది."

"క్రీప్ డి చైన్ అనో క్రేప్ డి షైన్ అనో అంటారూ, అదీ."

"ఏమో, ఆపేరు క్రీప్ డి షైన్ కాగూడదా? క్రేప్ డి చైన్ కాగూడదా?"

"ఏమో ఆ దేశాలన్నీ తిరిగి వచ్చినవారు మీకే తెలియాలి."

"నాకూ తెలియదులే!....నీకీ కుట్టుపనులన్నా నగిషీ పనులన్నా చాలా సరదాయేనా?"

"సరదాయే, ఈ మధ్య చాలారోజులబట్టి ఏమీ చెయ్యడంలేదు కాని..."

"అవును మరి, ఈ మధ్యని నీకు వేళెక్కడుంది ?"

"ఛీ, ఊరుకోండి...నిన్ననే మొదలుపెట్టేను. ఏమీ తోచక."

"ఈ నగిషీపనంతా ఇంత పట్టుపట్టి చేసేందుకు నీకు ఓపికకూడా ఉందీ ?"

"నిజానికి ఓపిక లేదు. చాలా చికాకైన పనిది. కొందరు ఒకపని తలపెడితే అది ముగించేవరకూ నిద్రపోరు. నే నారకం కాదు. జరిగినంతవరకూ జరగనివ్వమని బద్ధకిస్తూ ఉంటాను. ఒకపని మొదలుపెట్టేక పూర్తిచెయ్యకుండా ఏళ్ళతరబడి ఊరుకుంటాను."

"అలాఉంటే వీలులేదు మరి. ఏదీ, చూడనియ్యి ఎంతవరకూ అయిందో."

"మూడువైపులు పూర్తిగా అయాయి. నాల్గవవైపు నగిషీ రమారమి సఖం పూర్తి అయింది."

"ఎప్పుడు మొదలుపెట్టే విది?"

"నిన్ననే....అంటే, ఆమధ్యని కాస్త పనిచేసి అలా పెట్టెలోపడేసి ఊరుకున్నాను. నిన్ననే మళ్లా పైకితీసేను."

"అలా చెప్పు! అందుకే గుడ్డ మాసిపోయినట్టుగా ఉంది."

"అది మాయడంకాదు. గుడ్డ రంగే అంత."

"ఎప్పటికి పూర్తిచేస్తా విది ?"

"ఎప్పటికైతే మీ కెందుకు ? మీకే కుట్టిపెట్టున్నానని మీకంత ధైర్యం ఏమిటి ?"

"నాకు కాకపోతే మరెవరి కంటావు ?"

"నా కోసమే కాకూడదూ ?"

"నీకు ఇలాంటి జేబురుమా లెందుకూ ?...ఆమాటలన్నీ మాను. నే నడగగానే నాకోసమే అని వెంటనే అంటే ఎంత అందంగా ఉండునో ఆలోచించు."

"మీకేనండీ. మీకు కాకపోతే మరెవరికి ? ఇంతసేపూ వేళాకోళంగా మాట్లాడుతున్నాను. అంత తెలివైనవారు, ఆమాత్రం బోధపరచుకో లేకపోతే ఎలాగ ?..... అయితే దీనిని మీకు నేను బహుమానంగా ఇస్తే నాకు మీరేమి బహుమానం ఇస్తారు ?"

"నీకు నేను మొగుడినవడమే బహుమానం. వేరే బహుమానా లెందుకు ?...రేపు సాయంత్రానికి నువ్వా నగిషీపనంతా పూర్తి చేసెయ్యాలి. సంజీవరావు ఇంటికి మనం భోజనానికి వెళ్లినప్పుడు ఆ రుమాలు నా జేబులో ఉండాలి...జేబురుమాలుకి ఒకమూలని నా పేరుగూడా నగిషీలో వేస్తే బాగుంటుందేమో. తగినంత వేళ లేదంటావా ? పోనీ, ఆపని తర్వాత చెయ్యవచ్చునులే.

"రేపురాత్రి మీతో నాకు రావాలని లేదండీ."

"మళ్లీ మొదలుపెట్టకు. రేపు నువ్వు రాకతప్పదు. ఆ జేబురుమాలు గురించి బద్ధకించకు సుమా. తప్పకుండా తయారుగా ఉండాలి...రేపురాత్రి వాళ్లందరిమధ్యా దానిని పైకితీసి చూపించి, ఈ నగిషీపనంతా ప్రత్యేకంగా నాకోసం నువ్వు కష్టపడి చేసేవని వాళ్లందరితోటీ చెప్పొద్దు మరి?... ఏమంటావు ?"

# స్వేచ్ఛ

—oo✿oo—

నాలుగైదు నెలలక్రిందట ఒకనాడు రాత్రి నా స్నేహితుడు శ్రీనివాసరావు ఎంతో హడావిడిగా వచ్చాడు నా గదికి. "నీతో చాలా అవసరంగా మాట్లాడాలి, రామం" అన్నాడు.

నా బల్లమీద కచ్చేరి కాగితాల కట్టలు మూడంతస్థుల మేడలాగ పడున్నాయి. అప్పుడే పైకట్ట తీసి విప్పబోతున్నాను. ఈరాత్రి కూర్చుని ఈ కాగితాలన్నీ చక్కబెట్టుకోకపోతే నా గుమాస్తా ఉద్యోగం కాస్తా ఊడుతుందేమో అన్నంత దురవస్థలో ఉన్నాను. 'అన్నీ బకాయిలే' అంటూ, నా పైఉద్యోగి నన్ను ముప్పతిప్పలూ పెట్టున్నాడు. ఇటువంటి సమయంలో పొద్దున్న మా మామగారి దగ్గరనుంచి తన కూతురికి పదహారేళ్లు నిండిపోయాయనీ, ఇంకా నేను పెళ్లాన్ని కాపురానికి తెచ్చుకోకపోవడం అంత తెలివైన పని కాదనీ ఒక చిన్న ఉత్తరం! పొగలంతా కచ్చేరీలో ఆ ఉత్తరం గురించే ఆలోచిస్తూ కూర్చున్నాను. సరే, రాత్రి కచ్చేరీపని చేసుకుందా మనుకునేసరికి శ్రీనివాసరావు సిద్ధం.

"ఏమిటి, శీనూ?"

"రా మం, చా లా చె ప్పా లి....తొం ద ర ప నా ఇదంతా?"

"ఇదా? తొందరపనే అని నేను జవాబుచెప్తే నువ్వు వెళ్ళిపోతావా?"

"అంతకంటె కూడా నా పని ముఖ్యం, రామం... ఈఊళ్ళో నాకు చాలామంది స్నేహితులే ఉన్నారు. కాని నీ ఒక్కడి దగ్గరకే రావాలని తోచింది నాకు."

"శీనూ, నాదగ్గర డబ్బు లేదు సుమా. నువ్వు కిందటి నెల పట్టుకువెళ్ళిన పదిరూపాయిలూ ఇవ్వలేదింకా నాకు."

శ్రీనివాసరావు జేబులో చెయ్యి పెట్టేడు. ఆ బదులు సంగతి జ్ఞాపకం చేసినందుకు నాకే సిగ్గేసింది. నాలుగు రూపాయిలూ కొంతచిల్లరా పైకితీసి చూపించాడతను. "కావలిస్తే ఈ డబ్బు తీసికో, రామం. నేనిప్పుడు రావడం ఇంకా బదులుచెయ్యాలని కాదు. నాకు ఏమీ తోచడం లేదు. మతి పోయినట్టుంది. ఈ నిముషం నీ బల్లమీద తల వాల్చి ఏడ్చేసే స్థితిలో ఉన్నాను."

కాగితాల కట్ట మళ్ళా పక్కకి తోసేసేను.

"ఊరికే అన్నాను, శీనూ! తొందర లేదు, జేబులో పెట్టుకో. ఏమిటి జరిగింది?...అదేమిటి?... ఎందుకలా ఏడుస్తావు?... ఛా! ఛా!"......

ఇంతకు పూర్వం శ్రీనివాసరావు ఏడవడం చూసి పన్నెండేళ్ళో పదమూడేళ్ళో అయింది. మా ఇద్దరి చిన్నతనంలో పాఠశాలలో ఉపాధ్యాయుడొకడు పక్కవాడు చేసిన అల్లరి శ్రీనివాసరావే చేసేడనుకుని అతన్ని బల్లమీద నుంచోమన్నాడు. తనా అల్లరి చేయలేదన్న మాట చెప్పక బల్లమీద

ఆ గంటంతా ఏడుస్తూనే నుంచున్నాడు శ్రీనివాసరావు. నిజంగా అల్లరిచేసిన కుర్రాడు నవ్వుతూ పక్కని కూర్చున్నాడు.

కాసేపయాక శ్రీనివాసరావు తల ఎత్తి జేబురుమాలుతో కళ్లు తుడుచుకున్నాడు.

"ఏడిస్తే ఎలా, శీనూ? ఏమిటి జరిగిందో చెప్పు."

అప్పుడు సద్దుకుని, నావైపు చూడడానికి సిగ్గుపడి గోడవైపు పరధ్యాన్నంగా చూస్తున్నవాడిలా చూస్తూ చెప్పేడు.

"కామేశ్వరి నన్ను వదలి వెళ్లిపోయింది."

"ఎప్పుడు?"

"సాయంత్రం నే నింట్లో లేనప్పుడు."

"ఆవిడ నీ కేదైనా ఉత్తరం వ్రాసి ఇంట్లో ఉంచారా?"

"లేదు."

"ఎక్కడికి వెళ్లేరో, ఎవరితో వెళ్లేరో నీ కేమీ తెలియదన్న మాట?"

"ఎక్కడికి వెళ్లిందో తెలియదు. ఎవరితో వెళ్లిందో తెలుసును."

"ఎవరితో?"

"రమణయ్యతో."

"ఎవరు చెప్పేరు నీకు?"

"మా నౌకరు వెంకటసామి...వాళ్లిద్దరూ కలిసి

వెళ్లేరట. వెళ్తూ కామేశ్వరి నౌకరుతో నేను ఇంటికి వచ్చే వరకూ ఇల్లు కాపలాకాస్తూ కూర్చోమందట."

"మళ్లీ రాకుండా ఉండే ఉద్దేశ్యం మీద వెళ్లినట్టు నిర్ధారణ ఏమిటి?"

"నిన్న రాత్రి పోట్లాడుకున్నాం. ఇరవై నాలుగు గంటలలో నా ఇల్లువిడిచి పోతున్నానంది. నా భయాలన్నీ అందువల్ల...ఎంతసేపట్లో తను ఇంటికి వచ్చెయ్యదలచుకున్నదీ నా నౌకరుతో చెప్పలేదు. తొమ్మిది గంటలవరకూ వస్తుందేమోనని చూసి ఆఖరికి ఇలా వచ్చాను."

"ఆవిడ బట్టలు కాని, సామాన్లుకాని ఏమీ తీసుకు వెళ్లి పోలేదు కాదూ?"

"తీసుకు వెళ్లలే దనుకుంటాను. తన తాళాలు మట్టుకు ఇంట్లో లేవు."

"అంత బెంగపెట్టుకోవలసిన కారణం లేదనుకుంటాను, శీనూ."

"ఎన్నడూ ఇలా జరగలేదు. ఇదే మొదలు."

"రమణయ్య నీకు తెలుసును కాదూ?"

"తెలుసును."

"అత నీమధ్య గది మార్చేడని విన్నానులే."

"అవును."

"కనుక్కునేందుకు అక్కడికి ముందు వెళ్లలేదేమీ నువ్వు?"

ఆ ప్రశ్నకి సిగ్గుపడుతూ నాకేసి చూసేడు.

"ఏ ముఖం పెట్టుకొని వెళ్లను, రామం, నేను?"

"నన్ను వెళ్లి కనుక్కోమంటావా?"

"నీ ఇష్టం."

"అతని గదెక్కడ?"

"దేవాలయం వీధిలోంచి బోడపాటివారి వీధిలోకి తిరిగే కుడివైపున నాలుగో యిల్లు. మేడమీద గది. వీధిలోకి కిటికీ ఉంటుంది. ఇంటి యెదురుగుండానే మునసిపల్ దీపం ఉంటుంది.

"వెళ్లనా అయితే? నేను వచ్చేవరకూ ఇక్కడే కూర్చో నువ్వు."

"అన్నట్టు రామం ... సరేలే ... వెళ్లి కనుక్కో ముందు."

ఉత్తరీయం వేసుకొని బయలుదేరేను....

తోవలో శ్రీనివాసరావు దుస్థితిని గురించి అన్ని అంశాలూ ఆలోచించాను.

ఊళ్లో అనేకమంది శ్రీనివాసరావు భార్యకీ రమణయ్యకీ ఉన్న స్నేహం విషయమై మాట్లాడుకోడం విన్నాను. రమరణయ్య శ్రీనివాసరావుకి చాలా స్నేహితుడై ఉండడంవల్ల ఆ మాత్రంలో ఏమీ తప్పులేదని నేను వాదిస్తూ ఉండేవాడిని. శ్రీనివాసరావు అంటే నా ఉద్దేశ్యం ఎప్పుడూ అతనొక విచిత్రమైన మనిషనే. అయిదారు సంవత్సరాల క్రిందట అతను కొత్తగా భార్యతో కాపురం పెట్టినప్పుడు

నేను తనతో ఎంత చనువుగా ఉంటానో తన భార్యతో కూడా అంత చనువుగానూ ఉండాలని బలవంతపెట్టేవాడు. కొన్ని కొన్ని సమయాలలో అతనావిధంగా మాట్లాడుతుంటే నేనెక్కువ సిగ్గుపడేవాడినో, అతనిభార్య ఎక్కువ సిగ్గుపడేదో చెప్పడానికి వీలుండేదికాదు. నాకు చిన్నతనంనుంచీ మా అమ్మకోసం మా నాయనమ్మకోసం పరాయి ఆడవాళ్లు ఇంటికివస్తే నా గదిలోకిపోయి తలుపు వేసుకోడం అలవాటు. ఇతర ఆడవాళ్లంటే పట్టరాని సిగ్గు. అటువంటిది, తన భార్యని చూసిన రెండవమాటే నేను పేరుపెట్టి 'కామేశ్వరీ' అని పిలవాలని శ్రీనివాసరావు అనేసరికి అతని తెలివితక్కువ చేష్టలు నాకొక వెర్రికోపం కలుగజేసేయి. మొదటినుంచీ ఆవిడను నేను 'ఏమండీ' అనే పలుకరిస్తుంటే నేనేదో అది మర్యాదచేస్తున్నట్టుగా భావించుకునేవాడు శ్రీనివాసరావు. ఈ విషయంలో అతన్ని నేనెన్నడూ సరిగ్గా బోధపరచుకోలేక పోయాను.

చిన్నతనంలోనే శ్రీనివాసరావుకి తల్లితండ్రు లిద్దరూ పోయారు. పెంచి పెద్దవాడిని చేసిన నాయనమ్మకూడా అతనికి పెళ్లయిన రెండవసంవత్సరంలో చచ్చిపోయింది. అతని పందొమ్మిదవ ఏట భార్య కాపురానికి వచ్చింది. అప్పటి కావిడకి పదమూడేళ్లు. పల్లెటూరులో పెరిగిన పిల్ల. అందమయినదేకాని మొదట చూసినప్పుడు ముఖం కొంత మోటతనంగా కనబడింది. విస్తళ్లు కుట్టడం, వంట వండడం, తెలుగులో కాస్త చదవడం వ్రాయడం తప్ప అప్పట్లో ఆవిడకి మరేమీ తెలియవు. వచ్చిన కొన్నాళ్లలోనే శ్రీనివాసరావు

ఆవిడకి ఇంగ్లీషుభాష నేర్పడం మొదలెట్టేను. ఆవిడ కిప్పటి కైనా ఆ భాష అంత పట్టుబడిందని చెప్పలేను కాని, రాను రాను కొన్ని ఇంగ్లీషుముక్కలు సందర్భానుసారంగానూ, అసందర్భంగానూ కూడా ప్రయోగిస్తూ వచ్చేది.

శ్రీనివాసరావూ నేనూ కళాశాలలోకూడా ఒకే తరగతిలో ఉండేవాళ్లం. శ్రీనివాసరావుకి ఇంగ్లీషు భాషన్నా ఇంగ్లీషు వాఙ్మయం అన్నా చాలా అభిమానం. మిగిలిన విషయాలలో తోటి విద్యార్థు లందరూ తన పై వారయినా ఇంగ్లీలో ఎప్పుడూ అతనే మొదటివాడు. ఎంత చిన్నతనంలో నేర్చుకోడం ప్రారంభించినా విదేశపుభాష విదేశపుదే కనుక మిగిలినవాళ్లం అందరం ఆంగ్లేయ కవిత్వం సమంగా బోధపరుచుకో లేకపోయేవాళ్లం. శ్రీనివాసరావు అనేకమంది ఆంగ్లేయకవుల వ్రాతలు చదివి మాకందరికీ బోధపరుస్తూ ఉండేవాడు. ఆ కవులందరిలోనూ షెల్లీ అంటే అతనికీ అతి ప్రీతి. షెల్లీ జీవితచరిత్రం అతనికి కంఠోపాఠంగా వచ్చును. స్త్రీలని షెల్లీ ఎలా ఆదరించేవాడో, ఎలా అరాధించే వాడో చెప్తూ తన్మయుడై పోయేవాడు. పెళ్లిళ్లయిన తర్వాతకూడా భార్యాభర్తలు ఏవిషయంలోనూ ఒకరి స్వేచ్ఛ నొకరు నిర్బంధించకూడదనీ, ఇంకా ఆలోచిస్తే పెళ్లి అనే సంస్కారమే మానవస్వేచ్ఛకి ఆటంకపడుతుంది కనుక పెళ్లిళ్లే ఉండకూడదనీ షెల్లీవ్రాసిన పద్యాలు శ్రీనివాసరావు మాకు చదివి వినిపించి, షెల్లీ ఉద్దేశ్యాలతో మేమందరం ఏకీభవిస్తున్నామని ఒప్పుకొనేవరకూ మమ్మల్నందరినీ బాధపెట్టేవాడు. మొదటిలో శ్రీనివాసరావు ఉద్దే

శాలన్నీ సరదాగా వింటూవున్నప్పటికీ రానురాను పెల్లీ కవిత్వంలో ఉన్న స్వేచ్ఛకీ మన హిందూసంఘ పరిస్థితులకీ ఏవిధంగా లంకె కుదరగలదో నాకు బోధపడేదికాదు. కాని మాతోటే చదువుకుంటున్న వెంకటచలమూ, రమణయ్యా అనే ఇద్దరు కుర్రవాళ్లు శ్రీనివాసరావు పెల్లీ నెలా పూజించేవాడో శ్రీనివాసరావుని అలా పూజించేవారు. నాకిదంతా నచ్చేదికాదు. శ్రీనివాసరా వొక తమాషా మనిషి అనుకుని ఊరుకునేవాడిని. ఈ విషయం శ్రీనివాస రావుకూడా కనిపెట్టేడు. తనతో పూర్వపుటంత సరదాగా నేను మాట్లాడడంలేదని తప్పుపట్టేడు. తనకి మిగిలిన స్నేహితులంటే ఒట్టి స్నేహభావమేకాని, నేనంటే తనకి చాలా మర్యాదకూడా ఉందని చెప్పేడు. అతనంటే నాకు స్నేహభావంలో ఏమీ మార్పురాలేదని బోధపరిచాను. "వెంకటచలంతోనూ, రమణయ్యతోనూ నేను స్నేహంగా ఉండడం నీకు నచ్చలేదా?" అని నన్నొకసారి అడిగేడు. ఆ విషయంలో తన స్వేచ్ఛ తనదే అని నవ్వుతూ జవాబుచెప్పేను. వెంకటచలాన్ని కాని, రమణయ్యని కాని ఎప్పుడు కలుసుకున్నా ఆగి వాళ్లతో మాట్లాడేవాడినికాని ఎన్నడూ వాళ్లకి నేను చనువివ్వలేదు. వాళ్లకి కూడా నేనంటే లోలోపల కక్షగానే ఉండేది.

ఇంక కొన్ని నెలలకి పదిహేడేళ్లు నిండుతాయనగా శ్రీనివాసరావుకి పెళ్లయింది. నేను తనపెళ్లికి వస్తేనేకాని వీలులేదన్నాడు. వెళ్లేను. రమణయ్యా, వెంకటచలమూ పెళ్లికి రాలేదు.

మరికొన్ని నెలలకి వెంకటచలం పెళ్లి చేసుకున్నాడు. మరొక రెండుమూడు సంవత్సరాలలో శ్రీనివాసరావూ, వెంకటచలమూ కూడా పెళ్లాలని కాపురాలకి తెచ్చుకున్నారు. వెంకటచలం పెళ్లి చేసుకున్న రోజునుంచీ రమణయ్యతోనూ, శ్రీనివాసరావుతోనూ అంతచనువుగా తిరగడం మానేసేడు. అదిచూసి చాలామంది వెంకటచలమూ, రమణయ్యా ఎందుకో పోట్లాడుకున్నారని అనుకుంటూ ఉండేవారు. నిజానికిమట్టుకు వాళ్లిద్దరూ ఎన్నడూ పోట్లాడుకో లేదు.

రమణయ్య పెళ్లి చేసుకోలేదు. ఇప్పటికింకా అతను బ్రహ్మచారే. రానురాను శ్రీనివాసరావుకి అతనొక్కడే చాలా ఆప్యాయమైన స్నేహితుడుగా మిగిలిపోయాడు. శ్రీనివాసరావూ భార్యా ఎక్కడికి వెళ్లినా అతనుకూడా వాళ్లతో వెళ్లేవాడు. ప్రతిసాయింత్రమూ వాళ్లు ముగ్గురూ కలిసి షికారుకి వెళ్లేవారు. ఎప్పుడేనా శనివారంకాని, ఆదివారంకాని నేను శ్రీనివాసరావు ఇంటికి వెళ్లినప్పుడు రమణయ్య తప్పనిసరిగా అక్కడుంటూ ఉండేవాడు. శ్రీనివాసరావు భార్యని రమణయ్యకూడా ఊరికే పేరుపెట్టే పిలిచేవాడు. నేను వాళ్లింట్లో ఉన్నంతసేపూ మట్టుకు శ్రీనివాసరావుభార్య మరీచనువుగా మా అందరితోనూ వచ్చి కూర్చునేదికాదు. మొదటిలో భర్త ప్రేరేపణవల్ల నాతో చాలా స్నేహంగా ఉండేందుకు ప్రయత్నం చేసేదావిడ. ఆఖరాఖరికి నేను సిగ్గుబోతుననీ శుంఠననీ కనిపెట్టి, లోలోపల ఆవిడ నన్ను తృణీకరించేదనే నా అభిప్రాయం.

రెండేళ్ళకిందట నేను పెళ్ళి చేసుకున్నప్పుడు శ్రీనివాస రావునీ శ్రీనివాసరావుభార్యనీ తప్పకుండా పెళ్ళికిరమ్మని పిలిచాను. ఆవిడ రాలేదు సరిగదా, ఆఖరినిముషాన్ని భర్తని కూడా రాకుండా చేసింది. ఈ విషయం అతిరహస్యంగా శ్రీనివాసరావే తర్వాత బోధపరిచాడు. నేనేమీ మారు మాట్లాడలేదు.

మూడేళ్ళకిందట నేను కలెక్టరుకచ్చేరీలో గుమాస్తాగా ప్రవేశించాను. అప్పుడే శ్రీనివాసరావు మా ఊరి పెద్దపాఠశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించాడు. వెంకటచలం అంతకిముందరే బళ్లారిదగ్గర ఎక్కడో తాలూకా బోర్డులో ఉద్యోగం సంపాదించి వెళ్ళిపోయాడు. రమణయ్యకి ఇప్పటికింకా ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. పోలీసుశాఖలో ఆమధ్య రమారమి ఒకఏడాది పనిచేసేడు కాని మళ్ళీ వాళ్లు తీసికోలేదు. తెలుగులోనూ ఇంగ్లీషు లోనూ కథలూ పద్యాలూ వ్రాస్తూ కాలం గడుపుతున్నాడు. అప్పుడప్పుడు అతని వ్రాతలు పెద్దపెద్ద పత్రికలలో ప్రకటింప బడుతున్నాయి కూడాను.

కొన్నికొన్నిసార్లు శ్రీనివాసరావుని చూడడానికి అతవింటికి నేను వెళ్ళినప్పుడు అతనుండేవాడు కాడు. అయినా రమణయ్యమాత్రం ఇంట్లో కనబడేవాడు. భార్యతో రమణయ్యని ఒంటరిగాఉంచి శ్రీనివాసరావు బయటికి వెళ్లడం నాకు వింతగా తోచేదికాని, 'పీటిజోలి నాకెందుకు ?' అనుకుని ఊరుకునేవాడిని. శ్రీనివాసరావు నాతో ఈ రాత్రి వరకూ రమణయ్యగురించి ప్రత్యేకంగా ఎప్పుడూ మాట్లాడ

లేదు. రమణయ్యగురించి అతనితో నేను అంతకంటే మాట్లాడలేదు.

రమణయ్య యిల్లు జేరుకున్నాను. మ్యునిసిపల్ దీపం కింద నుంచుని "రమణయ్యగారూ, రమణయ్యగారూ" అని గట్టిగా పిలిచాను. "ఎవరది?" అని గంభీరంగా మేడమీాద నుంచి కేక వేస్తూ వీధికిటికీలోంచి నన్ను చూసి "మీారా! రండి, మేడమీాదికి రండి" అని పిలిచాడు.

"మీారే దిగివస్తే సంతోషిస్తాను" అన్నాను. దిగి వచ్చాడు.

"అలా కాస్తదూరం వెళ్లి మాట్లాడుదాం, రండి" అన్నాను.

నడుస్తుంటే అతనితో ఏమని చెప్పడమో నాకు తెలియలేదు. అతన్ని ఏమని అడగడమో బోధపడలేదు. ఆఖరికి, "మన.....శ్రీనివాసరావుభార్యని మీారు చూసేరా ఈవాళ?" అని అడిగేను.

"చూసేనండీ. ఆవిడా నేనూ ఈసాయింత్రం పిఠాపురం వెళ్లేతోవలో వున్న నాభివారితోటకి వెళ్లేము. అక్కడికి తీసుకు వెళ్లమం దావిడ. వెళ్లడం నడిచి వెళ్లేము కాని, ఆవిడ అలిసిపోయింది. వచ్చేందుకు వేళకి బళ్లు దొరకలేదు. అందుకే వచ్చేసరికి కొంత ఆలస్యం అయింది. ఇప్పుడిప్పుడే ఆవిడని ఇంట్లో దిగబెట్టి గదికి వచ్చాను...శ్రీనివాసరావు ఆవిడకోసం వెతుక్కుంటున్నాడా?"

నాకు ఒళ్లు మండుకొచ్చింది. కాని కోపం ఆపుకు

స్నాను. "వెతుక్కోడం అంటే.....ఇప్పుడిప్పుడే మా ఇంటికి వచ్చాడు లెండి, నా కేమైనా తెలుసునేమో కనుక్కోనేందుకు. నే నిలా వచ్చాను. అతను......వేరేచోట్ల వెతుకుతున్నా డతను."

"అయ్యయ్యో! మేము వెళ్తున్నట్టు శ్రీనివాసరావుకి తెలుసుననుకున్నాను. నాతో కామేశ్వరి....కామేశ్వరి నాతో చెప్పడం శ్రీనివాసరావుతో చెప్పేనని చెప్పినట్టు జ్ఞాపకం."

"ఫరవాలేదు లెండి. అతనుకూడా బెంగపెట్టుకోలేదు. ఏమైపోతారు మనుష్యులు? వెళ్తాను."

"అనవసరంగా మీకుకూడా శ్రమ కలుగజేసేం, క్షమించాలి."

ఇల్లు జేరుకుని శ్రీనివాసరావుతో చెప్పవలసినదంతా చెప్పేను.

"ఈవాళ అక్కడికి వెళ్తానని కామేశ్వరి నాతో చెప్పనేలేదు" అని విసుక్కున్నా డతను.

అతను లేచి వెళ్ళిపోతుంటే ఆఖరి క్షణాన్ని "శీనూ, రేపుసాయింత్రం ఆరుగంటలకి ఇలా వస్తావా? నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాను, "సరే,"అన్నాడు శ్రీనివాసరావు, ఆశ్చర్యపోయి చూస్తూ.

మొన్నాడు అతనితో అతనికుటుంబవిషయమై యేమీ వత్తూ ధైర్యంచేసి మాట్లాడాలని నిశ్చయించుకున్నాను.

మొన్నాడు కలుసుకున్నప్పుడు అతని ప్రశంస నేను

ఏమీ ఎత్తకుండానే అతను కొన్నిసంగతులు చెప్పడం ప్రారంభించాడు.

"నిన్నరాత్రి నాకూ కామేశ్వరికీ ఒక ఘోరయుద్ధం జరిగింది, రామం. నాకు ఎన్నడూ రాని కోపం వచ్చింది. ఆ వెర్రికోపంలో కామేశ్వరిని నానామాటలూ అన్నాను. సఖం వండుతూఉన్న వంట మాని ఏడుస్తూవచ్చి పడుకుంది. ఇద్దరం తిండి తినలేదు. అలాఉండగా పదిగంటలకో పదిన్నరకో రమణయ్య వచ్చాడు. నేనూ కామేశ్వరీ కూడా మౌనంగా ఉండడంచూసి నా క్షమార్పణకోరి వెళ్లిపోయాడు......నిన్న అతన్ని చూస్తుంటే నాకు అరికాలి మంట నెత్తికొచ్చింది."

"శీనూ, ఇంతవరకూ వచ్చింది కనుక ధైర్యంచేసి అడుగుతున్నాను. రమణయ్యని నీ ఇంటికి అంతచనువుగా ఎందుకు రానిస్తావు నువ్వు? దానికి అతను అర్హతలేని మనిషి..."

"ఇంట్లో చనువుమాట నేను చెప్పడంలేను, రామం. అది వేరే సంగతి. రాత్రి అంత ఆలస్యంగా వచ్చేటప్పుడు నాతో చెప్పనక్కరలేదూ? అదీ నాకు పట్టుకున్న కోపం. ఊరంతా వెతుక్కోనా నేను?...చనువు కేముంది?..."

"మాటవరసకి చెప్పేను సుమా, శీనూ. నువ్వేమీ అనుకోవద్దు."

తన కుటుంబవ్యవహారాలు నాతో నిర్మొఖమాటంగా చెప్పేందుకు శ్రీనివాసరావు ఇష్టపడడంలేదని గ్రహించాను.

ఇంకా నాకు తెలియకుండా దాచేందుకు ప్రయత్నిస్తున్నా డతను. నే నీవిధంగా అతని విషయంలో అనవసరంగా కలుగజేసుకున్నాను కదా అని విచారించాను. ఇప్పటికి కూడా అతను ఇంత తెలివితక్కువగా ఉండేటట్టయితే అతని దురదృష్టం అతనిదే అనుకుని ఊరుకున్నాను.

అటుతర్వాత ఒక నెలరోజుల లోపున నా కుటుంబ పరిస్థితులలో చాలా మార్పులు జరిగేయి. మా మామ గారిఊరు వెళ్లి మాఆవిడని కాపురానికి తెచ్చుకున్నాను. పూర్వం నే నుంటున్న గది వదిలేసి ఒక చిన్న ఇల్లు అద్దెకి పుచ్చుకున్నాను. అన్నిటికంటే ముఖ్యమయిన మార్పు హోటలుతిండి బదులు మాఆవిడ వంట. ఆ హోటల్ తిండి వల్ల నేను పడ్డ బాధలు దేవుడికే తెలుసును.

ఆ నెలరోజులలో శ్రీనివాసరావుని నేను ఆట్టే చూడ లేదు. తర్వాత ఒకసాయింత్రం అతనూ భార్యా మా ఇంటికి వచ్చారు. మా ఆవిడ చేసిన కాఫీ చాలా బాగుందని అతను మెచ్చుకున్నాడు. మా ఇద్దరినీ ఒకసారి తనింటికి రమ్మన్నాడు. శ్రీనివాసరావుభార్య కూడా మాఆవిడని రమ్మని చాలాసార్లు అడిగింది.

వాళ్లు వచ్చివెళ్లిన రాత్రి మాఆవిడ తామలపాకులు చుట్తూ "మీస్నేహితుడి పెళ్లాం నాకు నచ్చలేదు సుమండీ" అంది. ఎందువల్ల నచ్చలేదని అడిగితే, "ఆవిడ షోకులూ, ఆవిడ వెకిలితనాలూ చూస్తే అసహ్యం వేసింది. ఆ చేతులు లేని జాకెట్లూ, ఆ ముసిముసినవ్వులూ ఎందుకొచ్చినవని ?

అటుపైని, నిముషనిముషానికీ, నాతో మాట్లాడుతూకూడా మీవైపు చూడడం ఎందుకూ ?'' అని జవాబిచ్చింది.

వారం పదిరోజులలో మే మిద్దరం శ్రీనివాసరావు ఇంటికి భోజనానికి వెళ్లేం. శ్రీనివాసరావుభార్య ఆరోజు కొక వంటమనిషిని కుదిర్చి అందరం ఒకేసారి ఒకేపంక్తిలో భోజనం చేసేటట్టు ఏర్పాటుచేస్తే, తీరా భోజనానికి లేచే వేళకి మా ఆవిడ మొగాళ్లతో పంక్తిలో కూర్చుని భోజనం చెయ్యనంది. మే మందరం ఎంతచెప్పినా వినలేదు. ఆఖరికి శ్రీనివాసరావు నవ్వుతూ మరేమీ ఫరవా లేదు. మొగవాళ్లం ముందర లేద్దాం'' అన్నాడు. నాకు సిగ్గేసింది. మా ఆవిడ తన పంతం నిలబెట్టుకుంది. శ్రీనివాసరావుభార్యా తనూ మేము లేచేక భోజనానికి వెళ్లేరు. ఈ మార్పుకి శ్రీనివాసరావుభార్య చాలా అసహ్యించుకుందని నేను కనిపెట్టేను.

అందరిభోజనాలూ అయ్యాక మా ఆవిడ చర్యకి మనస్సులో దుఃఖపడుతూ నేను మౌనంగా కూర్చున్నాను. శ్రీనివాసరావుకూడా మరేకారణం వల్లనో చాలా మౌనంగా ఉన్నాడు. రమణయ్యమట్టుకు చాలా ఉత్సాహంగా ఉన్నట్టు నటిస్తూ దానిగురించీ దీనిగురించీ అనేకవిషయాలు మాట్లాడడం మొదలుపెట్టేడు. అతను చెప్తున్న మాటలు కొన్ని నేను విన్నైనా వినలేదు. అంతసేపూకూడా అతను ఏ విధంగానైనా శ్రీనివాసరావుని సరదాగా కబుర్లలో పెట్టడానికి ప్రయత్నిస్తున్నట్టు నాకు తోచింది. శ్రీనివాసరావు రమణయ్యమాటలు వింటున్నట్టు అప్పుడప్పుడు నటించినా ఏదో విషయమై అతను చాలా బాధపడుతున్నట్టు నాకు కని

పించాడు. కుటుంబవిషయమే అయిఉంటుం దనుకున్నాను. శ్రీనివాసరావుభార్య కూడా వేరే మా ఆవిడతో పక్క గదిలో కూర్చున్నా ప్రతి అయిదునిముషాలకీ ఒకసారి వచ్చి మాతో కూర్చుని శ్రీనివాసరావుతో ఏదో ఒక సంభాషణ మొదలుపెట్టబోయేది. ఇలా నాలుగైదుసార్లు వద్దంటున్నా కూడా "ఇంకా తామలపాకులు కావాలా!" అని ఆవిడ అడిగితే, ఆఖరిసారి విసుక్కుంటూ అతను "ఎన్నడూ లేనిది ఈవాళ నన్నింత ఆప్యాయంగా ఇన్నిసార్లడుగుతున్నా వేమిటి! నాకేమీ వద్దు" అన్నాడు. ఆవిడ చిన్నబుచ్చు కుంటూ, "మీకని కాదు. మీ స్నేహితులకి కావాలేమో నని అడిగేను" అని సమాధానం చెప్తే, "కొత్తగా ఈ సిగ్గులన్నీ ఎందుకు? వాళ్ళని నువ్వే అడుగు" అని సణిగే సేడు. చటుక్కున లేచి వెళ్ళిపోయి ఆవిడ మళ్ళీ మా దగ్గరకి రాలేదు.

ఆ రోజున వెళ్ళిపోతూ శ్రీనివాసరావునీ భార్యనీ ఎప్పుడైనా మాఇంటికి వస్తూఉండమని కోరేను. రమణయ్యని మాత్రం పిలవలేను. మా ఆవిడ శ్రీనివాసరావుభార్య తనకి బొట్టు పెట్తున్నప్పుడుకూడా ఆవిడతో 'వెళ్తున్నాం' అన్న ముక్క అనలేను.

తర్వాత సరిగా రెండువారాలకి ఒకసాయింత్రం శ్రీని వాసరావు నాకు బాకీఉన్న పదిరూపాయిలూ ఇచ్చెయ్య డానికి వచ్చాడు. కాసేపు కూర్చుని కాఫీతాగి వెళ్లమన్నాను. కాఫీతాగుతూ నెమ్మదిగా, "రామం, ఒకవేళ నేను అక స్మాత్తుగా చచ్చిపోతే నా ఆస్తిసంగతీ కామేశ్వరిసంగతీ

నువ్వే చూసుకోవాలి సుమా'' అన్నాడు. నా గుండె గుబాలుమంది.

''నువ్వు అకస్మాత్తుగా చచ్చిపోవడం ఏమిటి, శీనూ? ఎందుకు నీకా ఉద్దేశ్యం కలగాలి?''

''ఉద్దేశ్యాని కేముంది? అది ఎవరికయినా జరగొచ్చు నుకా...కామేశ్వరికి దగ్గరచుట్టా లెవరూ లేరు. మేనమామ పెంచేడు. పిల్లలు లేకుండా పోయాడాయన. ఆ మేనమామ పెళ్లానికీ కామేశ్వరికీ పడదు.''

''అది సరేలే...నిన్ను మనస్సులో ఏదో చాలా బాధిస్తోంది, శీనూ. అదేమిటో నాకు చెప్పాలి.''

''నీకు తెలుసును.''

''నా కెలా తెలుస్తుంది, శీనూ?''

''నీకు తెలుసును.''

''అయితే, రమణయ్యేనా?''

''అవును.''

''రమణయ్యని మీ ఇంటికి రావద్దని చెప్పకూడదూ నువ్వు?''

''ఇప్పుడు చెప్పినా లాభంలేదు.''

''ఎప్పుడైతే ఏమిటి?''

''అంతా అయిపోయాక...''

''అంటే?''

''రామం, మీ ఆవిడ వింటుందేమో!''

"ఇక్కడిమాటలు వంటగదిలోకి వినపడవు."

"మీ ఆవిడతో నువ్వు ఎన్నడూ చెప్పనని వాగ్దానం చెయ్యి."

"ఎన్నడూ చెప్పను, శీనూ."

"కామేశ్వరికి రమణయ్యతో చనువు ఎంతదూరం వెళ్ళడానికి వీలుందో అంతదూరమూ వెళ్ళిపోయింది."

"నిజంగా?"

"తనే ఒప్పుకుంది. రమణయ్య కూడా ఒప్పుకున్నాడు ...ఒకరాత్రి కామేశ్వరి ఇంట్లోలేదని నిన్ను నీ గదిలో చూడడానికి రాలేదూ నేను—ఆ రాత్రే."

ఇంత కఠోరమైన వార్త శాంతంగా, తడుముకోకుండా శ్రీనివాసరావు నాకు చెప్తుంటే నాకు ఆశ్చర్యం వేసింది. నాకు మట్టుకు నాకే రమణయ్యఅంటే ఎక్కడ లేని కోపం పుట్టుకొచ్చింది. ఆ ఆవేశంలో ఆ క్షణం రమణయ్య నా ఎదురుగుండా ఉండుంటే నేనేమి చేసుందునో చెప్పలేను.

"అయితే, ఇప్పు డేమిటి చేస్తావు, శీనూ?"

"ఏమిటి చేసేది?...మొన్నాడుకూడా నిన్ను చూడడానికి వచ్చాను, జ్ఞాపకం ఉందా? అప్పటికప్పుడే నాకంతా తెలుసును. అప్పుడే నీకంతా చెప్పేద్దామనుకున్నాను. మళ్లీ,...చెప్పడానికి బుద్ధిపుట్టలేదు...నా స్థితిలో నువ్వుంటే నువ్వేమిటి చేస్తావు, రామం?"

"ఆవిడని పుట్టింటికి పంపించేస్తాను. ఎన్నడూ ఏలనని చెప్పేస్తాను."

"కామేశ్వరికి మేనమామపెళ్లాం తప్ప మరెవరూ లేరు. ఆవిడకి కామేశ్వరి నచ్చదు."

"ఆవిడతోనే ఉండాలన్న మాటేమిటి? ఎక్కడైనా ఉండొచ్చును. డబ్బిచ్చి పొమ్మను."

"నా కంత డబ్బుకూడా లేదు."

"నువ్వ డబ్బుమట్టుకు ఎందుకివ్వాలి? రమణయ్యచే పోషించుకోమను కావలిస్తే."

"మన హిందూసంఘంలో తనిప్పుడు నేను బతికుండగా రమణయ్యని పెళ్లిచేసుకునేందుకు వీలులేదుకా."

"వాడితో పెళ్లిచేసుకునే ఉండాలన్న మాటేమిటి?"

పెళ్లి చేసుకోకుండా రమణయ్యతో తను కాపురం చెయ్యడం నా కిష్టంలేదు."

"నిన్ను మోసపుచ్చి నిన్ను వదలిపెట్టి పోయాక కూడా తనఘోష నీకెందుకు, శీనూ?"

"అకస్మాత్తుగా నేను చచ్చిపోతే రమణయ్యని తను పెళ్లి చేసుకోవచ్చును."

"నీకేమైనా పిచ్చెత్తిం దేమిటి, శీనూ? ఆత్మహత్య చేసుకోవాలని చూస్తున్నావా?"

"అబ్బె బ్బె!"

"మరేమిటి నీ మాటలధోరణి?"

"రామం, ఇటువంటి సందర్భమే పాశ్చాత్యసంఘంలో తటస్థిస్తే వాళ్లు ఎంత సునాయాసంగా సర్దుకుంటారో ఆలోచించు. విడాకులిచ్చాక భార్య మళ్లీ పెళ్లిచేసుకోవచ్చు."

సామాన్య మానవస్వభావానికి ఇంత వ్యతిరిక్తంగా తన స్వంతదుఃరవస్థ మరచిపోయి, మొగజన్మ ఎత్తినందుకు ప్రబలంగా ఉండవలసిన అసూయకూడా ఏకోశాన్నీ లేకుండా, ఇంత నిర్మలంగా సంఘపరిస్థితులగురించి చర్చిస్తున్న శ్రీనివాసరావుని చూస్తే నిజానికి నాకు అసహ్యం వేసింది. 'ఇతనొక పిచ్చివాడు. ఇతనికేమీ పౌరుషం లేదు. చిన్నప్పటి నుంచీ ఇతను అర్థంలేని కవులప్రపంచంలోనే మెలిగేడు కాని, ఈ మానవప్రపంచం ఏమిటో, మానవుల సుగుణాలేమిటో, దుర్గుణాలేమిటో ఇతనికేమీ తెలియవు. ఇతనొక లోకవిరుద్ధమైన అప్రయోజకుడు,'' అని నాలో నేను ఎన్నిసార్లో అనుకున్నాను. ఆఖరికి ఊరుకోలేకపోయాను.

"శీనూ, మీ ఆవిడ గురించి ఆమాట విన్నప్పుడు నీకు పిచ్చెత్తలేదూ? ఒళ్లు మండుకుపోలేదూ? రమణయ్యని చంపెయ్యాలన్నంత కోపం రాలేదూ!"

"అన్నీ జరిగేయి, రామం. పిచ్చెత్తింది. ఒళ్లు మండుకు పోయింది. రమణయ్యని చంపేద్దామన్నంత కోపమూ వచ్చింది. కాని శాంతంగా ఆలోచించకుండా మనంకూడా హఠాత్తుగా ఏదో వెర్రిపని చేసేటట్టయితే మనకీ అడవి ప్రజకీ భేదం ఏమిటి! మనకీ మిగిలిన జంతువులకీ భేదం

ఏమిటి?...ఆరాత్రే నాకు వాళ్లిద్దరిగురించీ అనుమానం కలిగింది. కామేశ్వరిని నిజం చెప్పమని చంపేసేను. ఆరాత్రి మట్టుకు నా కోపమూ నా అసూయా నేను వర్ణించలేను. చాలాసేపు ఏమీ జరగలేదని వాదించడం మొదలు పెట్టింది. నేను నమ్మనన్నాను. కొంతసేపటికి నా పోరుపడలేక ఒక్కసారిమట్టుకు రమణయ్య తనపెదవులు ముద్దు పెట్టుకున్నాడని ఒప్పుకుంది. రమణయ్యని తను మళ్లీ చూడనని వాగ్దానం చేస్తూ, క్షమించమని నన్ను బతిమాలుకుంటూ ఏడవడం ప్రారంభించింది. ఇంకా తను నాతో పూర్తిగా నిజం చెప్పడంలేదని నాకు తెలుసునన్నాను. నన్ను తిట్టింది. రాత్రికి రాత్రే తను లేచివెళ్లిపోతానంది. అప్పుడు వీధితలుపు తాళంవేసి తాళం దగ్గరపెట్టుకుని కూర్చున్నాను. ఏడ్చి ఏడ్చి, ఆఖరికి నిజం అంతా చెప్పేసింది. నేనేమిచేసినా భరిస్తానంది. తను అగాధంలో పడి కొట్టుకుంటున్నానంది. రమణయ్యఅంటే తనకి గాఢమైన ప్రేమ అనిచెప్పి ఏడ్చింది. అంతవరకూఅసూయతోనూ, పౌరుషంతోనూ, గర్వంతోనూ బాధపడుతున్న నాకు ఎక్కడలేని దుఃఖం వచ్చింది. చంటి పిల్లవాడిలా ఏడ్చేసేను. ఒక అరగంటైనా గుక్కతిప్పుకుండా అలా ఏడ్చుంటాను. ఆ అరగంటా కామేశ్వరి ఏమిటిచేస్తోందో కూడా నా కప్పుడు తెలియదు. కాని ఆఖరికి తనకొక వాగ్దానం చేసేను. తన జీవితప్రవాహానికి నేను ఎన్నడూ అడ్డుపడనన్నాను. తన స్వేచ్ఛకి నేను ఎన్నడూ భంగం కలుగచెయ్యనన్నాను. ఇప్పటికీ నా ఉద్దేశ్యం అదే. తన స్వేచ్ఛకి నేను అడ్డురాను.''

స్వేచ్ఛ! స్వేచ్ఛ!

"ఏమిటి, శీనూ, ఈ పిచ్చి ఊహలూ నువ్వూనూ?"

శ్రీనివాసరావు లేచి నుంచున్నాడు. జవాబు చెప్ప లేదు.

"పోనీ, ఏమిటి చెయ్యదలచుకున్నావు, శీనూ, నువ్వు?"

"నువ్వేదైనా సలహా చెప్తావేమో అనుకుంటే నా సహాయానికి నువ్వు రాలేదు."

"ఆవిడని పారదోలి నీ బతుకు నువ్వు బతుకు."

"ఏదో ఒకటి చేస్తాను...నీ పదిరూపాయిలూ నీ కిచ్చేసేను కాదూ?"

"ఇచ్చేసేవు...శీనూ, ఆత్మహత్యమట్టుకు తలపెట్టకు సుమా. ఎందుచేత అంటున్నానంటే, నీ సంగతి నాకేమీ బోధపడడం లేదు... తెలివితక్కువ పని మట్టుకు చెయ్యకు."

"ఆత్మహత్య చేసుకుంటాననే నీ ఉద్దేశ్యం?"

"ఏమో, నువ్వు మళ్లీ రేపిక్కడికి రా. సాయంత్రం రా. మనిద్దరం మళ్లీ దీని విషయమయి మాట్లాడుదాం. ఈ రాత్రంతా నీ గురించే ఆలోచిస్తూవుంటాను. వస్తావా రేపు?"

"వస్తాను."

మొన్నాడు శ్రీనివాసరావు రాలేదు. సాయంత్రం ఆరుగంటలకి అతని నౌకరు వచ్చి అతను ఆత్మహత్య చేసుకున్నట్టూ, పోలీసువాళ్లు వచ్చి నన్ను పిలుచుకు రమ్మన్నట్టూ కబురుచెప్పేడు; నేను భయపడుతున్నట్టే అయింది. మా ఆవిడ కబురు వినగానే కూలబడి పోయింది.

ఉన్నవాడిని ఉన్నట్టుగానే శ్రీనివాసరావు ఇంటికి పరుగెత్తేను. ఇంటిచుట్టూ ప్రజ మూగిఉన్నారు. గుమ్మం దాటగానే రమణయ్య కనబడ్డాడు. అతనికేసి సమంగా చూడనైనా చూడలేదు నేను. లోపలికి వెళ్ళేను. ఒక పోలీసు ఉద్యోగీ, ఇద్దరు పోలీసువాళ్ళూ శ్రీనివాసరావు పడక గదిలో ఉన్నారు. ఒక పోలీసువాడు నన్ను పైకి తోసెయ్య బోయాడు. శ్రీనివాసరావు శవం మంచం మీదుంది. నేను శ్రీనివాసరావు స్నేహితుడనని బోధపరిచాను. ఆ ఉద్యోగి నావైపు తిరిగి "రామలింగంగారంటే మీరేనా" అని అడిగేడు. ఆత్మహత్య చేసుకునేముందు శ్రీనివాసరావు నాకొక ఉత్తరం వ్రాసేడని చెప్తూ ఆ ఉత్తరం నాకిచ్చాడా ఉద్యోగి. ఆ ఉత్తరంలో ఉన్న విషయం ఇదీ:

"రామం, నాకు మరొక మార్గం కనబడ లేదు. నువ్వేమనుకుంటావో నాకు తెలుసును... నేను పౌరుషంలేని వాడినని! అదినిజమేనేమో. కాని కామేశ్వరిని నేను చాలా ప్రేమించాను. నా జీవితం అంతా తనమీద ఆధారపెట్టు కున్నాను. తమ జీవితం మరొకరిమీద ఆధారపెట్టుకునే వాళ్ళ గతి ఎప్పుడూ అన్యాయమే. నేను చెయ్యగలిగినది మరేమీ నాకు తోచలేదు.

"పోలీసువాళ్ళకి కూడా ఒకఉత్తరం వ్రాసిఉంచాను. విషం తెచ్చుకు తాగినది నాతప్పే. మరెవరి తప్పూ కాదు. ముఖ్యంగా రమణయ్యనీ, కామేశ్వరినీ పోలీసువాళ్ళు బాధ పెట్టకూడదని నా ప్రార్థన. ఈ విషయమై నువ్వు జాగ్రత్తగా చూడాలి.

"నా పెద్దల భూములూ, ఆస్తీ కామేశ్వరి మళ్ళీ పెళ్ళి చేసుకుంటే కామేశ్వరి అనుభవించడానికి వీలుండదు. కాని ఇంపీరియల్ బ్యాంకిలో నా స్వంతడబ్బు రెండువేల పైచిల్లర వేరేఉంది. అది కామేశ్వరికే. ఒకవేళ రమణయ్య కామేశ్వరిని పెళ్ళి చేసుకోక పోయేటట్టయితే ఆ డబ్బుతో కామేశ్వరి చదువుకుని వృద్ధిలోకి రావాలని నా ఆశ. రమణయ్య తనని పెళ్ళి చేసుకున్నా కూడా ఆ డబ్బు తనదే.

"నీకు కామేశ్వరి అంటే అభిమానం లేదని నాకు తెలుసును. కాని, నాకోసం, నన్ను జ్ఞాపకం ఉంచుకుని, తన మంచిచెడ్డలు నువ్వు చూచుకోవాలని నా ప్రార్థన. రమణయ్య పెళ్ళి చేసుకునే వరకూ అయినా నువ్వు చూచుకోవాలి.

"ఇదే నా ఆఖరి ఉత్తరం.

"నాకేమీ చింత లేదు. రైలుప్రయాణానికి వెళ్తున్నట్టుంది...ఒకవూరు విడిచి మరొకవూరికి. నిజానికి, మళ్ళీ, మరొకఊరు జేరుతానన్న ఆశాలేదు. మన కాళ్ళకింద పడి చచ్చిపోతున్న ప్రతిచీమా మరొకవూరు జేరుకుంటోందా? మరొకఊరు జేరుకుని ఇక్కడికంటే సుఖపడుతోందా.... ఏదీ ఉండదు.

ఇంతే,

శీను."

ఉత్తరం చదువుకుంటూ నేను ఏడుస్తుంటే పోలీసు డాక్టరు శవాన్ని తీసుకుపోయి కోయించి పరీక్షచెయ్యవలసి

ఉంటుందన్నాడు. మొన్నాడు పొద్దున్న పరీక్షఅయిపోయాక దహనకృత్యాలకి శవాన్ని ఇచ్చేస్తారన్నాడు. మొన్నాడు ఇది ఆత్మహత్య అని స్థిరపడేవరకూ శ్రీనివాసరావు నాకు వ్రాసిన ఉత్తరంకూడా తనదగ్గరే ఉంటే మంచిదన్నాడు. శ్రీనివాసరావు వ్రాసిన రెండుఉత్తరాలూ ఉన్నాయికనుక అతనిభార్యతో తను ప్రత్యేకంగా మాట్లాడవలసిన అవసరం లేదనే తన ఉద్దేశ్యం అన్నాడు.

పోలీసువాళ్లు శవాన్ని తీసుకు వెళ్ళిపోయారు. నేను మాఇంటికి వెళ్లి మాఆవిడని శ్రీనివాసరావుఇంటికి తీసుకు వచ్చాను. మొదట రమ్మంటే రానని పట్టుపట్టింది. ఆదుర్ధ సమయంలో నాలుగుతిట్లు తిట్టేసరికి కిక్కురుమనకుండా నావెంట వచ్చింది. మేమిద్దరం శ్రీనివాసరావు ఇంట్లోకి వెళ్లేసరికి రమణయ్య శ్రీనివాసరావుభార్య పక్కని కూర్చొని ఓదారుస్తున్నాడు. మమ్మల్ని చూసి లేచినుంచున్నాడు. అంతవరకూ అతనితో నే నేమీ మాట్లాడలేదు. నాతో అతనూ ఏమీ మాట్లాడలేదు. అతన్ని చూస్తుంటే నాకు అరికాలిమంట నెత్తికొచ్చింది. "మీరు వెళ్లండి. ఇంకిక్కడక్కరలేదు," అన్నాను. "వెళ్తున్నాను," అని సమాధానం చెప్పాడు. శ్రీనివాసరావుభార్య కేసి చూస్తూ, "మళ్లీవస్తాను, కామేశ్వరీ" అన్నాడు. నేను చూస్తూ నుంచున్నాను. అతను వీధిగుమ్మం దాటుతుంటే నాకొక ఉద్దేశ్యం కలిగింది. వెంటవెళ్లి "రమణయ్యగారూ, మరొక మాట చెప్పాలి," అని పిలిచాను. ఆతను "ఏమిటి ?" అంటూ వెనక్కి తిరిగేడు. ఆ దుఃఖంలోనూ, ఆ కోపం

లోనూ ఒళ్లు తెలియక అతన్ని సాగదీసి లెంపకాయ కొట్టేను. నాకేసి తెల్లపోతూ చూసే డతను. "ఇదే చెప్ప దలచుకున్న మాట" అన్నాను. మారు మాటాడకుండా వెళ్లిపోయాడు.

ఆరాత్రి ఎవరూ ఎవరితోనూ మాట్లాడలేదు. తెల్ల వారేవరకూ శ్రీనివాసరావుభార్య ఏడుపు నాకు వినిపిస్తూనే ఉంది.

ఆరాత్రే తంతి కొత్తే మొన్నాడు శ్రీనివాసరావు చుట్టాలు కొందరు వచ్చారు. అందులో శ్రీనివాసరావు పినతండ్రికొడు కొకడు శ్రీనివాసరావుభార్యని పడతిట్లు తిట్టుంటే వెళ్లి బలవంతాన అతన్ని ఆపవలసివచ్చింది.

దహనం అంతా అయాక శ్రీనివాసరావుచుట్టాలతో అతని ఆస్తివిషయం మాట్లాడి, అతను నాకు ఆఖరిని వ్రాసిన ఉత్తరం చూపించాను.

ఒకరాత్రి మాత్రమే ఉండి వాళ్లంతా వెళ్లిపోయారు.

మూడవరోజున మా ఆవిడ నన్ను, "ఈ రెండు రోజు లలోనూ చాలా గ్రహించాను కాని, ఆయన ఎందుకు ఆత్మ హత్య చేసుకున్నారో నిజంగా అంతా చెప్పరూ?" అని అడిగింది. అంతా పూర్తిగా బోధపరిచాను.

"ఈవి డిటువంటిదని చూసిన మొదటినాడే నాకు తట్టింది సుమండీ" అంది.

ఆ మధ్యాహ్నం రమణయ్య వచ్చి, శ్రీనివాసరావు

భార్యతో ఏదోమాట్లాడి వెళ్ళిపోయాడు. మళ్ళీ నా కతడు కనబడ లేదు.

నాల్గవరోజున ఆ ఇల్లు వదిలేసి శ్రీనివాసరావుభార్యని వెంటబెట్టుకొని సామాన్లన్నిటితో మా ఇంటికి వచ్చేసేము.

శ్రీనివాసరావు పోయిన పదిహేనురోజులకి అతని భార్య చెన్నపట్నం వెళ్ళిపోయి చదువుకుంటానని చెప్పి, చెన్నపట్నంలో సదుపాయాలన్నీ చేసిపెట్టమంది. సదుపాయాలన్నీ చేసి ఆవిడ నక్కడ దిగబెట్టి, ప్రతినెలా డబ్బు పంపిస్తానని చెప్పి, ఇంటికి వచ్చేసేను.

"మీరు నాకు చాలా సహాయపడ్డారు. మీ దయ నే నెప్పటికీ మరిచిపోలేను," అందావిడ, నేను వచ్చేస్తుంటే.

"మీకు చేస్తున్నదంతా నేను మీమీద అభిమానం కొలదీ చెయ్యడంలేదు," అని సమాధానం చెప్పేను.

"ఆ విషయం నాకుకూడా తెలుసును," అందావిడ. ఇల్లు చేరుకున్నాక నన్ను మాఆవిడ శ్రీనివాసరావుభార్య గురించి అనేకప్రశ్నలు వేసింది.

ఆఖరికి "చెన్నపట్నంలో రమణయ్య మీకు కన బడ్డాడా?" అని అడిగింది.

"కనబడ లేదు" అన్నాను.

"మీరు చూస్తూఉండండి. వాడు చెన్నపట్నంలోనే ఉన్నాడు," అంది.

ఈ సంభాషణ జరిగిన రెండురోజులకే శ్రీనివాసరావు భార్య దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. రమణయ్య చెన్న పట్నం వచ్చాడనీ, రమణయ్యని తను పెళ్లి చేసుకుంటున్నా ననీ, శ్రీనివాసరావు ఆస్తి తనకేమీ అక్కరలేదనీ మూడే మూడు పంక్తులు వ్రాసింది.

వెంటనే శ్రీనివాసరావు ఆస్తి గురించి వివరాలు తెలియపరుస్తూ ఆవిడకి చెన్నపట్నానికి నేను ఉత్తరం వ్రాస్తే, ఆవిడ ఎక్కడున్నదీ తెలియలేదని టపావాళ్లు నా ఉత్తరం నాకు తిరక్కొట్టేసేరు.

"రెండువేల రూపాయిలిలా ఆమనిషి తోసిపారేస్తుం దనుకోలేదు సుమండీ," అంది మా ఆవిడ.

రమణయ్యకి ఉద్యోగం లేదన్నమాట ఆలోచిస్తూ, రూపాయిల విషయమై నేనూ ఆశ్చర్యపడ్డాను.

# వంశవృక్షం

మూలపేటగ్రామంలో ఒక ఘోరమైన విపత్తు సంభవించింది. తెల్లవారకుండానే రామస్వామి అనే ఆసామి ఊరు వెలుపలికి వెళ్తుంటే అతనికి పొదలసందులో రక్తమయమైన మృతకళేబరం ఒకటి కనబడింది. నిర్ఘాంతపోయి వెనక్కి తిరిగి, గ్రామంలోకి పరుగెత్తి, మొదట తనభార్యకీ, తర్వాత తన మామగారికీ, ఆఖరికి గ్రామమునసబుకీ ఆ సంగతి చెప్పాడు. అరగంటలో గ్రామంయావత్తూ శవం చుట్టూ మూగింది. శవం వీరన్నకొడుకుది. పాపం, ఏడేళ్లయినా నిండలే దాకుర్రాడికి, ఎవరో మెడ సగం నరికేసేరు. రక్తపు బొట్లు జిగటగా ఇంకా నేలమీదికి కారుతున్నట్టే ఉన్నాయి. గ్రామంలోవాళ్లు చాలామంది ఆ ప్రదేశంలో చేరినతర్వాత వీరన్నా, అతనిభార్య లక్ష్మాయీ, వాళ్ల చిన్నకూతురూ వచ్చారు. వీరన్న దుఃఖం ఆపుకోలేక, చచ్చిపోయిన కొడుకు రెండుచేతులూ పట్టుకుని ముద్దుపెట్టుకుంటూ, కొడుకు గుండెమీద తలవాల్చి 'అయ్యో, అయ్యో' అని మొర్రపెట్తూ, ఏకధారగా ఏడ్చేడు.

వీరన్నంటే గ్రామానికంతకీ అభిమానం. పుట్టినది సామాన్యపు వ్యవసాయపు కుటుంబంలోనైనా, నడతలోనూ, శీవిలోనూ, బుద్ధిలోన్తూ, ధైర్యసాహసాలలోనూ ఎవరికైనా సిగ్గురప్పింప గలిగినవాడు. శరీరచ్ఛాయ నలుపేకాని,

ముఖంలో కళాకాంతు లున్నాయి. వీరన్న భార్య లక్ష్మాయి కూడా చాలా యోగ్యురాలు. వీరన్నకి భార్యఅంటే ఇంతా అంతా కాదు ప్రేమ. అంత అందమైన స్త్రీ ఈలోకంలో లేదని వీరన్న గర్వం. దార్లపూడిగ్రామంలో పెళ్లి చేసుకుని వచ్చి మూలపేటగ్రామంలో కాపురంచేస్తున్న మొదటిరోజులలో లక్ష్మాయి కేసి ఎవరినీ చూడనిచ్చేవాడు కాదు. ఆరోజులలో లక్ష్మాయి మేనమామకొడు కొకడు మూలపేటప్రాంతాలలో ఉండడం తటస్థించి మేనత్తకూతురు నొకసారి చూసిపోదామని వస్తే, తను గుడిసెలో లేనప్పుడు తనభార్యని చూడడానికి వచ్చాడన్న వెర్రికోపం పెట్టుకుని, వీరన్న లక్ష్మాయి చుట్టాన్ని కొట్టేసరికి, లక్ష్మాయిచుట్టం మూడురోజుల వరకూ మాట్లాడలేకపోయాడనీ, తిండి తినలేకపోయాడనీ అందరికీ తెలిసిన కథే. కాని పెద్దవాడయిన కొలదీ ఇటువంటి వెర్రులన్నీ పోయి వీరన్నకి నెమ్మదీ, పొక్తావారీతనం పట్టుబడ్డాయి. ఈ మార్పు చూసి గ్రామంలో అందరూ ఆశ్చర్యపడ్డారు. చుట్టుపట్లనున్న గ్రామా లన్నిటిలోనూ వీరన్నంత పెద్దమనిషి కాని, వీరన్నంత చాకచక్యం గలవాడుకాని ఎవడూ లేడని అతనికి పేరొచ్చింది.

సుమారు ఏడేళ్లయింది లక్ష్మాయికి నాగన్న పుట్టి. తల్లిదండ్రులలాగే నాగన్నకూడా అందమైనవాడు. కాని కుర్రవాడికి తల్లిదండ్రులకులేని శరీరచ్ఛాయ వచ్చింది. పండుతూఉన్న జామపండు రంగు. చూసీ చూడగానే, క్షత్రియకులమో, బ్రాహ్మణకులమో అన్నట్లుండేవాడు. మూలపేటకి దగ్గరలోనే ఒక గ్రామంలో బ్రాహ్మణపురో

హితు డొకాయన ఉన్నాడు. ఆయనపిల్లల్ని చూసి ఎవ
రైనా కాపువాళ్లనుకునేవారు కాని, నాగన్నని చూసి ఎవరూ
రైతుకుర్రవాడని చెప్పగలిగేవారు కారు. నాగన్నకి చక్కని
ముక్కు, పెద్ద నుదురు, చారెడేసి కళ్లు! తల్లికీ తండ్రికీ
కొడుకంటే చెప్పరాని గారాబం. అదీకాక ఆ కుర్రవాడు
పుట్టిన నాలుగైదేళ్లవరకూ లక్ష్మాయికి పిల్లలు లేరు.
అప్పుడు రామి పుట్టింది. అందువల్ల కూడా అంత గారాబంగా
పెరిగేడు నాగన్న. ఏడేళ్లు పెరిగేడు. ఘోరంగా చచ్చి
పోయాడు.

లక్ష్మాయి రామిని దింపి, తనకొడుకు పొట్టని కొడుకు
కడుపునిండా అన్నంతిన్నప్పుడు ఆ పొట్టని తడిమినట్లు తడిమి,
ఒక్కసారి గుక్కతిరక్కుండా ఏడ్చేసి, లేచి, కళ్లు కొంగు
తో తుడుచుకుంటూ, రామిని మళ్లీ ఎత్తుకుని, పిచ్చెత్తిన
దానిలా రామిని బుగ్గలమీదా, కళ్లమీదా, ముక్కు
మీదా, నుదురుమీదా ముద్దుపెట్టుకుంది. రామి ఈ చేష్ట
లేమీ బోధపరుచుకోలేక బేరుమని ఏడవడం మొదలు
పెట్టింది. లక్ష్మాయి ఈ లోకాన్నంతా మరచిపోయినట్టూ,
'వీళ్లంతా ఎవరు' అన్నట్టూ చచ్చిపడున్న కొడుకుకేసీ,
వెర్రిగా గోలపెట్తున్న మొగుడుకేసీ చూస్తూ నుంచుంది.

గ్రామం అంతా 'చంపిన దుర్మార్గు డెవడా?' అని తల్ల
డిల్లిపోయారు. కుర్రవాడు ఎన్నడూ ఎవరినీ బాధించిన
వాడు కాదు. వీరన్నా, లక్ష్మాయీ కూడా గ్రామంలో
ఎన్నడూ ఎవరికీ అపరాధం చేసి ఎరగరు. వాళ్లిద్దరూ
అంటే అందరికీ అభిమానమే. అందరికీ ప్రేమే. పోనీ, కుర్ర

వాడిమీద ఏమైనా నగలున్నాయేమో నంటే, మెడలో కాని, మొలలోకాని వెండిపావలాకాసైనా లేదు. ఎవరు చంపినట్టు? ఎందుకు చంపినట్టు? ఎవరికీ బోధపడలేదు.

మునసబు గ్రామస్థులందరినీ ఇళ్లకి పొమ్మన్నాడు,—రామస్వామినీ, వీరన్ననీ, లక్ష్మాయినీ, తప్ప. 'కాసేపట్లో గుసగుసలాడుకుంటూ ఎవరింటికి వాళ్లు వెళ్లిపోయారు. మునసబు వీరన్న కేసీ, లక్ష్మాయి కేసీ చూస్తూ, "ఇంట్లో కొడుకు లేడన్నమాట ఇంతవరకూ తెలుసుకోనే లేకపోయారర్రా, వెర్రివాళ్లలారా?" అన్నాడు. రాత్రంతా వీరఘుంటలవారి కొబ్బరితోటలో కాపలా కాస్తూఉన్నాడు వీరన్న. తెల్లవారిన తర్వాత తను ఇంటికి వచ్చేసరికి నాగన్న లేడింట్లో. లక్ష్మాయిని అడిగితే కాలకృత్యాలకని ఊరిబయటికి పోయుంటాడని సమాధానం చెప్పింది. ఇంకా వస్తాడని చూస్తూ ఉండేసరికి, ఎదురింటి చంద్రమ్మ వచ్చి "మీ నాగన్నని ఎవరో చంపేసేరట" అని కబురుచెప్పింది. పిచ్చెత్తినవాళ్లలా ఇద్దరూ పరుగెత్తుకు వచ్చారు. నిన్నరాత్రి వీరన్న తోటకి పోయేవేళకి నాగన్న నిద్రపోతూ ఉన్నాడు. లక్ష్మాయి ఈ వాళ నిద్రలేచేక నాగన్నని చూడలేదు కాని, సగంరాత్రి వేళ తను నిద్రపోయేముందు కొడుకుని కళ్లారా చూసింది. చలిగాఉందని చెప్పి తన పాతచీర మడిచి నాగన్నకి కప్పింది కూడాను. పొద్దున్న లేచేసరికి నాగన్న లేడు. తన పాతచీర ఒకపక్కగా పడుంది. నాగన్న లేకపోవడం చూసి, మామూలువేళ కానప్పటికీ మామూలుగానే బయటికి వెళ్లేడనుకుంది. కొన్ని నెలలుబట్టి నాగన్న అవసరం వచ్చి

నప్పుడల్లా తల్లినికాని, తండ్రినికాని లేపి తోడురమ్మనకుండానే బయటికి పోతున్నాడు. కలలోనైనా అనుకోలేదు వాళ్లు బ్రతికుండగా నాగన్నని మళ్లీ చూడమని.

"మీా పిల్లవాడిని ఏ కక్షవల్లనైనా ఎవరైనా చంపి ఉండొచ్చునని మీాకు ఎటువంటి అనుమానాలైనా ఉన్నాయా?" అని అడిగేడు మునసబు.

వీరన్న లక్ష్మాయి కేసి చూసేడు.

"మామీాద కక్ష లెవరికుంటాయి బాబూ?" అంది లక్ష్మాయి.

నిజమే, వీరన్నమీాద కక్ష పెట్టుకునేవాళ్లెవరుంటారు? మునసబుకి ఈ హత్య బోధపరుచుకునే మార్గం ఏమీా తోచలేదు.

మాలపేటకి ఒకరితర్వాత ఒకరు పోలీసుద్యోగులు వచ్చారు—ఉప్పాడకనిస్టేబు మొదలు జిల్లాసూపరెంటు వరకూ, గ్రామంఅంతా పరీక్ష చేసేరు. వీరన్న గుడిసె అంతా క్షుణ్ణంగా చూసేరు. పిల్లవాడి పూర్వచరిత్రా, తల్లిదండ్రుల పూర్వచరిత్రా అంతా కనుక్కున్నారు. గ్రామంలో పెద్ద మనుష్యుల నందరినీ చేరదీసి ఈ విషయమై ప్రశ్నలు వేసేరు. గ్రామంలోనే ఒక పిచ్చివాడు తనే నాగన్నని చంపేనని అందరితోనూ చెప్తుంటే వాడిని తీసుకుపోయి రెండురోజులు ఖైదులోఉంచి మళ్లీ వదిలేసేరు,—ఉరిశిక్ష వెయ్యకుండా. చంపినవాడు నాగన్న మెడని వాడిగల కత్తితో నరికేడన్న మాట నిశ్చయం అన్నారు. చంపిన తర్వాత, చంపినమనిషి

ఆకత్తిని అంటుకున్న రక్తం ఉత్తరదిక్కున వీరఘుంటలవారి తోటకి వెళ్లే పుంతలో పడిఉన్న ఒక చింకిగుడ్డతో తుడిచి, గుడ్డని ఆ పుంతలో మళ్లీ పారేసి వెళ్లిపోయాడని కూడా కని పెట్టేరు. అంత మరీనమ్మకంగా చెప్పేందుకు వీలులేదుకాని, మునసబుగారి సరుగుడుతోటకి దక్షిణాన్నిఉన్న మురికినీటి గుంటలో కత్తిని ఆఖరిసారి శుభ్రంగా కడుక్కున్నట్టు కూడా సూచనలు కనిపిస్తున్నాయన్నారు. సీమలోనూ, కలకత్తా బొంబాయిలలోనూ పాదాలముద్రలనుబట్టీ, చేతిముద్రలను బట్టీ హంతకులనీ, దొంగలనీ పట్టుకుంటున్నారు కాని, పల్లె టూళ్లలో పుంతలలోనూ, గుంటలదగ్గరా లక్షలకొలది పాదాలముద్రలు ఉండడంవల్ల ఈసందర్భంలో వాళ్ల సహజ నైపుణ్యం చూసేందుకేమీ వీలులేదని విసుక్కున్నారు. ఆరువారా లయాక చంపినవాడెవడో కనిపెట్టలేమని నిశ్చ యించుకొని ఈవిషయమై ఇంక చర్చ వదులుకున్నారు.

రెండుమూడు నెలలలో మూలపేటగ్రామంలో హడా విడి తగ్గిపోయింది. గ్రామం మళ్లీ యథాప్రకారంగానే ఉంది. బట్టలనేత నడివీధిలో మామూలుగానే జరుగుతోంది. పొలాలకి పోయేవాళ్లు మామూలువేళలకి పొలాలకి పోతు న్నారు. ఎప్పుడూ జరుగుతున్నట్టే ప్రాణంలేని ఎడ్లతో భూములు దున్నుతున్నారు. సాయంత్రం కల్లుదుకాణం దగ్గిర ఎప్పటంత అల్లకల్లోలమూ జరుగుతూనేఉంది. మిఠాయి శోమటి బెల్లపుజీడిపప్పు కొల్లలుగా ఇంకా అమ్ముతూనే ఉన్నాడు.

నాగన్నచావు గురించి సామాన్యంగా మాట్లాడడం కూడా మానేసేరు ప్రజ. ఎవరికీ ఆ చిత్రవధ బోధపడలేదు.

వీరన్నకి తప్ప.

ఎందువల్ల నంటే, నాగన్నని చంపినది వీరన్నే.

రమారమి ఏడెనిమిదేళ్ల క్రిందట వేసంగిశెలవలకి కాకినాడనుంచి వీరఘంటలవారి కుటుంబం అంతా రెండు నెలలు వాళ్ల తోటలో గడిపేందుకని మూలపేటకి వచ్చారు. ఉప్పాడలో నాలుగు రెండెడ్లబళ్లు కట్టుకు ఒకనాడు సాయంత్రం ఆరుగంటలకి తోట చేరుకున్నారు.

వీరఘంటల సుందరరామయ్య పంతులుగారు చాలా పేరుప్రతిష్ఠలున్న మనిషి. ఆయనకి చిన్నతనంలోనే మొదటిభార్య పోవడంవల్ల మళ్లీ పెళ్లి చేసుకుంటే, రెండవ భార్య కూడా ఇరవైఏళ్లు నిండకుండా ముగ్గురు కొడుకుల్నీ, ఒకకూతుర్నీ కని ఇరవై ఒకటవ యేట హఠాత్తుగా పోయింది. రెండవభార్య పోయినప్పుడు సుందరరామయ్యగారికి ముప్పై అయిదేళ్లు. మళ్లీ పెళ్లి చేసుకో లేదు. సంస్కృత సాహిత్యంలో ప్రవేశం ఉండడంవల్ల వేదాలూ, ఉపనిషత్తులూ, భారత భాగవతాలూ చదువుకుంటూ కాలం వెళ్లబుచ్చేవాడు. పెద్దలు సంపాదించిన ఆస్తి ఉండడంవల్ల ఉద్యోగం చేసే అవసరం ఆయనకి లేకపోయింది.

ఈసారి ఆయన మూలపేటగ్రామానికి వచ్చినప్పుడు ఆయన ముగ్గురుకొడుకులూ, ఇద్దరు పెద్దకోడళ్లూ, మనమలూ, మనమరాళ్లూ అందరూ వచ్చారు. ఆయన పెద్ద

కొడుకు లిద్దరికే పెళ్ళయింది. మూడవకొడుకు సుబ్రహ్మణ్యానికి ఇంకా పద్దెనిమిదేళ్లు నిండలేదు.

వీరఘంటలవారి కుటుంబంతోపాటు, సుందర రామయ్యగారి రెండవకొడుకు మామగారైన అన్నంభొట్ల వెంకయ్యగారూ, ఆయనభార్యా, ఆయన రెండవకొడుకు రామచంద్రుడూ కూడా వచ్చారు. వెంకయ్యగారంటే సుందరరామయ్యగారికి చాలా అభిమానం. చిన్నతనంనించీ వాళ్లిద్దరూ స్నేహితులు. అనేకసార్లు సుందరరామయ్యగారూ, వెంకయ్యగారూ కలిసి మూలపేట వచ్చి వారంపది రోజులు కలిసి ఉండేవారు. స్నేహితులైనా వాళ్ల ఇద్దరి స్వభావాలలోనూ చాలా వ్యత్యాసముంది. సుందరరామయ్యగారు కలిసిగొట్టుగా అందరితోనూ మాట్లాడేవాడు కాదు. వెంకయ్యగారు మనిషి కనబడడం తడవుగా కబుర్లలోకి దిగేవాడు. వెంకయ్యగారు చమత్కారంగా కబుర్లు చెప్తుంటే సుందరరామయ్యగారు నవ్వి ఆనందించడమే కాని ఆయనంతట ఆయన సరదాగా ఉండేవాడు కాడు.

సుందరరామయ్యగారు ఒక్కరూ అనేకసార్లు మూలపేట వస్తూఉండేవారు కాని, ఇదే మొదటిసారి ఇంత పరివారంతో ఈ గ్రామం రావడం. ఆపాటి ఈపాటి మక్తాలు వచ్చే భూములు ఆయనకి కోనసీమలో ఉన్నప్పటికీ, ఆ ప్రాంతాలకి అంత తరుచు వెళ్లకపోయినా, కాపులేని కొబ్బరితోట కోసమూ, ఎన్నేళ్లు పెరిగినా ఎప్పుడు కొట్టుకు అమ్ముకోడమో తెలియని సరుగుడుతోట కోసమూ, పూతైనా చూచి ఆనందించడానికి తగని నాలుగైదువందల మామిడి

మొక్కల కోసమూ రెండేసినెలల కొకసారి మూలపేట వచ్చి, ప్రతిసారి అధమం వారంరోజులైనా ఉండకుండా వెళ్లే వాడు కాదు సుందరరామయ్యగారు. సుమారు ఇరవైఏళ్లు గడిపే డీలాగ. కొబ్బరితోటల్లో ఆశ వదులుకో వలసి వచ్చే వేళకి సరుగుడువల్ల లక్షాధికారి నైపోవాలనుకుంటూ ఉండే వాడు. సరుగుడు సమంగా పెరగక, ఆ పెరగనిస్థితిలోనే కొట్టి నష్టపోయే వేళకి మామిడితోటవల్ల సంచీలు వచ్చి చేతిలో పడతాయి అంటూఉండేవాడు. కొబ్బరికి పెంట చాలదనేవాడు, కొత్త సరుగుడుతోట క్రింద వేసే రెమ్మలు కొట్టిస్తే దివ్యంగా ఉండు ననేవాడు, మామిడిలో జాతితప్పు కాని నేలతప్పు కాదనేవాడు. ఎలా అయితేనేమి—సరదా తీరేందుకు సముద్రపువార కనుక ఆ గ్రామానికి వెళ్తున్నట్టు అయేదికాని, డబ్బుచేసేరీత్యా అయేదికాదు.

సుందరరామయ్యగారి తోటలన్నీ చూసుకోడం మొదట్లో వీరన్నతండ్రి ముసలయ్య. ముసలయ్య పోయాక ముసలయ్య పెత్తల్లికొడు కొకడు చూసిపెట్టేవాడు. ముసలయ్య మొదటినుంచీ అసలు జబ్బుమనిషి. కాని అతనిభార్య సుబ్బి చిన్నతనంనుంచీ చాలా చాకచక్యంగల మనిషి. మొగుడు హయాములోనూ, మరిది హయాములోనూ, తర్వాత కొడుకు వీరన్న హయాములోనూ కూడా వ్యవసాయపు పనులు ఇతరులు చేసినా, ముఖ్యపెత్తనం అంతా డబ్బువిషయంలో తనే నిర్వహించుకుంటూ వచ్చేది. కొడుకు పెళ్లి చేసుకునే వరకూ బ్రతికింది. మనుమడు పుట్టకుండానే పోయింది.

ఈసారి సుందరరామయ్యగారు అందరినీ వెంటపెట్టుకుని మూలపేటకి వచ్చినప్పుడు వీరన్నకి ఇరవై ఇరవై ఒక్క సంవత్సరాల వయస్సు. అప్పటికి ఏడాదిపైని కొన్ని నెలలయింది లక్ష్మాయిని పెళ్లిచేసుకుని. అప్పటికప్పుడే లక్ష్మాయి మేనమామకొడుక్కి పళ్లువిరగడం కూడా జరిగింది.

వీరఘంటలవారి తోట గ్రామానికి రమారమి మైలున్నరదూరంలో ఉంది. అందులో మధ్యని ఒక బంగాళా. బంగాళాకి ఒకవైపున అందరూ పడుకునేందుకు ఒక పందిరి. మరొకవైపున వంటలకీ, భోజనాలకీ ఏర్పాటు. ఈసారి వీరందరూ వచ్చినప్పుడు, వీరన్న ఉప్పాడవరకూ వెళ్ళి, బళ్లుకుదిర్చి వీరందరినీ తోటబంగాళా దగ్గరికి చేర్చేడు. తోటలో లక్ష్మాయి, వేడినీళ్లు పోసుకునేవాళ్లకి వేడినీళ్ళు కాచిపెట్టీ, కాకినాడనుంచి కూరలూ గట్రా తెచ్చుకుంటారో లేదో అని కూరలుతెచ్చి ఉంచీ, పొయ్యిలు అలికిపెట్టి శుభ్రంగా ఉంచీ, కర్రలు జాగ్రత్తపెట్టీ, అన్ని సౌకర్యాలూ తయారుగా ఉంచింది. సుందరరామయ్యగారిని చూడగానే ఇంతముఖం చేసుకుని, 'బాబుగారూ' అంటూ ఆయన పాదాలకి నమస్కారం చేసింది.

"మహాచక్కని పిల్లని పెళ్లి చేసుకున్నావోయి, వీరన్నా. మాఆవిడ కూడా చిన్నప్పుడు ఇంత అందంగానూ ఉండేది" అన్నాడు వెంకయ్యగారు.

నవ్వుతూ, "ఆ బాబుగారికి కూడా నమస్కారం చెయ్యి మరి" అన్నాడు వీరన్న.

ఆడవాళ్ల స్నానాలన్నీ అయి, వంట ప్రారంభం అయాక, "ఇక వెళ్ళు లక్ష్మాయీ, బాగా చీకటిపడింది కూడాను. ఇంకా వంట చేసుకోవాలి కాబోలు నువ్వు" అన్నాడు సుందరరామయ్యగారు.

"మా వంటలకేం లెద్దురూ, బాబూ,....పోవే, పో. తర్వాతొస్తాలే నేను" అన్నాడు వీరన్న.

పక్కకి పిలిచి నెమ్మదిగా "ఎంతసేపట్లో ?" అని అడిగింది లక్ష్మాయి.

"గంటయాక రావచ్చు, తెల్లారేక రావచ్చు. చెప్తే కాని వీల్లేదా ?...పో, నీ పనులు చూసుకో" అని కసిరేసేడు వీరన్న.

ఈ సంభాషణ జరిగిన పదిపదిహేను నిముషాలలో లక్ష్మాయి మళ్లీ తోటబంగాళా దగ్గరకి ఊపిరాడకుండా హడావిడిగా వస్తే, అందరూ ఇదేమిటని అడిగేరు. జవాబు చెప్పక ఏడుస్తూ కూర్చుంది లక్ష్మాయి. వీరన్న కఠినంగా ఏవో రెండు ముక్కలంటే, సుందరరామయ్యగారి కేసి చూస్తూ, ఆఖరికి, "నాకు భయమేసింది బాబూ! ఇద్దరం కలిసే పోతాం" అని మాత్రం సమాధానం చెప్పింది. ఇటూ అటూ ఏవైపునుంచి ఎవరు వస్తారో అన్నట్టు ధ్వనులువింటున్న లేడిలా బెదిరిపోతూ నాలుగుదిక్కులూ పరీక్షచేస్తూ కూర్చుంది. "వెర్రిగోల బాబూ!" అని విసుక్కున్నాడు వీరన్న. గంటోఎంతో అయాక, వీరన్న పక్కలన్నీ వేసేక, ఇద్దరూ కలిసి వెళ్లిపోయారు.

భోజనం వేళకి చూస్తే సుందరరామయ్యగారి మూడో అబ్బాయి సుబ్రహ్మణ్యమూ, వెంకయ్యగారి కొడుకు రామచంద్రుడూ ఇద్దరూ లేరు.

"సముద్రపువారకి పోయారేమో ?" అన్నాడు సుందరరామయ్యగారి పెద్దకొడుకు సర్వేశ్వరరావు.

వాళ్లు ఎంతసేపటికీ రాకపోతే, ఆఖరికి మిగిలినవాళ్లు భోజనాలకి కూర్చున్నాక, మజ్జిగలు కలుపుకుంటుంటే తయారయారు వాళ్లిద్దరూ. వస్తూనైనా తిన్నగా భోజనాలకి రాకుండా ఇటూఅటూ పచార్లుచేస్తుంటే "ఇప్పటికైనా దయచెయ్యండి. మీకోసం కనిపెట్టుకుని ఆడవాళ్లు ఏడుస్తూ కూర్చోవలసిందేనా ? ఎక్కడికి పోయారు ?" అని అడిగేడు వెంకయ్యగారు.

"అలా సముద్రపువారకి వెళ్లి, అలా అలా తిరిగి తిరిగి, మళ్లా బంగాళాదగ్గరికి వద్దామనుకునే సరికి తోవ తప్పిపోయాం" అన్నాడు రామచంద్రుడు నసుగుతూ నసుగుతూ.

"తోవ ఎలా తెలియకుండా ఉంటుందర్రా, చీకట్లో ఈ పెట్రోమాక్సుదీపం మైళ్లకిమైళ్లు కనిపిస్తూఉంటుంది కదా !" అని అడిగేడు సుందరరామయ్యగారు.

మొన్నాడు రుద్రుడిలా వచ్చాడు వీరన్న, ఇంకా పూర్తిగా తెల్లవారకుండానే.

సుందరరామయ్యగారిని 'బాబూ' అని పక్కకి పిలిచి, క్రిందటిసాయింత్రం లక్ష్మాయి ఇంటికిపోతుంటే అబ్బాయిగోరు చటుక్కున వచ్చి, లక్ష్మీనారాయణగారి

తోటదగ్గర లక్ష్మాయి చెయ్యి పట్టుకుని చొరవచేయబోతే లక్ష్మాయి తప్పించుకుని మళ్లీ బంగాళాదగ్గరికి పరుగెత్తుకు వచ్చిందని చెప్పేడు.

సుందరరామయ్యగారు "అదేమిటోయి వీరన్నా, ఏ అబ్బాయోయి?" అని ఇంకా ఏదో అనబోతుంటే, "మీ అంత డబ్బుగలవాళ్లం కాకున్నా మేమూ మానం, మర్యాదా ఉన్నవాళ్లమే బాబూ. ఇదే మీవారు కాకుండా మరొకరై యున్నట్టయితే—కూనీలు జరుగవలసినంత పని. మా తల్లినాటినుంచీ, తండ్రినాటినుంచీ మీ కాళ్లనంటి బతుకుతున్నవాళ్లం కనుక వచ్చి మీతో చెప్పుకుంటున్నాను" అన్నాడు వీరన్న.

అప్పుడు ప్రారంభమయింది చర్చ: లక్ష్మాయిని చొరవ చెయ్యబోయినది ఎవరూ అని. సుందరరామయ్యగారి మూడవకొడుకు సుబ్రహ్మణ్యమో, వెంకయ్యగారి కొడుకు రామచంద్రుడో అయుండాలని తేలింది.

వెంకయ్యగారు "మావాడే అయుంటాడు, దొంగ వెధవ. రెండువారాల క్రిందట, కాకినాడలో పక్కింటి వెంకట్రామయ్యగారు వీడు గోడలు ఎక్కడమూ, తొంగి చూడడమూ మరీ అన్యాయంగా ఉన్నాయనీ, ఆయన కూతుళ్లని వీడు అవమాన పరుస్తున్నాడనీ గోలపెట్టేడు, పాపం, బ్రాహ్మడు. పోనీ, వెధవకి పెళ్లిచేసేద్దామంటే పదహారేళ్లు నిన్నో మొన్నో నిండేయి" అన్నాడు.

ఇంతట్లో రామచంద్రుడు ఈ అట్టహాసం చూడ్డానికి వచ్చాడు.

"ఏమిరా వెధవా, నువ్వేనా ఈ వెధవపని చేస్తా?" అని అడిగేడు వెంకయ్యగారు.

"ఏ వెధవపని, నాన్నా?" అన్నాడు రామచంద్రుడు నదురూబెదురూ లేకుండా.

"ఇంతసేపూ వినడంలేదురా? దొంగవేషాలూ నువ్వూను."

"లేదు, నాన్నా!"

అప్పుడు బోధపరిస్తే, "నిన్న మనం రాగానే సుబ్రహ్మణ్యమూ, నేనూ సముద్రపువారకి వెళ్లిపోయాం. బంగాళాకి వచ్చేవరకూ ఇద్దరం కలిసేఉన్నాం. ఇంకా కావలిస్తే వాడిని అడుగు" అన్నాడు రామచంద్రుడు.

సుబ్రహ్మణ్యం కూడా వచ్చాడు. "ఏరా, నువ్వూ నేనూ కలిసే వెళ్లేంకాదురా సముద్రపువారకి? అంత సేపూ కలిసేఉన్నాం కాదూ?"

"ఏమిటీ? ఆ చర్చ ఎందుకు వచ్చిందిప్పుడు?"

సుబ్రహ్మణ్యానికి కూడా బోధపరిచారు.

"మాకేం తెలియదు. బుద్ధిపొరపాటున సముద్రపు వారకి వెళ్లి తోవతప్పి ఏడుస్తూ అర్ధరాత్రి ఇంటికి జేరుకుంటే మాకిదొకటి కూడానా? నాకేం తెలియదు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

సుబ్రహ్మణ్యం మాట్లాడుతున్నంతసేపూ సుందరరామయ్యగారు అతన్నే పరీక్షగా చూస్తూ నుంచున్నాడు. కొడుకుమాట నమ్మలేదు.

"నీ పెళ్లాం సరిగ్గా పోలిక పట్టలేదటోయి!" అని అడిగే డాయన వీరన్నని.

"శుద్ధ మొద్దావతారం, బాబూ! నిన్న రాత్రంతా అడిగితే పెద్దబ్బాయిగారేమో అంటుంది. పెద్దబ్బాయిగారు ఆరకం కాదని నాకు తెలుసు బాబూ" అన్నాడు వీరన్న.

"పెద్దవాడు నిన్నసాయింత్రం ఇక్కడనుంచి కదలందే" అన్నాడు సుందరరామయ్యగారు. నీ పెళ్లాం మళ్లీ వచ్చినప్పుడు వాడు మాతో ఇక్కడే కూర్చున్నాడుగా?"

"ఎవరిని చూసి మా అబ్బాయిలలో ఒకరనుకుందో నోయి మీ ఆవిడ" అన్నాడు వెంకయ్యగారు.

నాలుగైదురోజులు వీరన్న లక్ష్మాయిని పీడించుకు తిన్నాడు, "పోలిక చెప్పలేవటే?" అంటూ.

ఆఖరికి సుందరరామయ్యగారి మూడవఅబ్బాయేనని అనుమానం గట్టిగా మనస్సులో ఉంచుకుని, నాలుగైదు రోజులు లక్ష్మాయిని బంగాళాకి రావద్దనికూడా హుకుం ఇచ్చాడు. నాలుగైదురోజు లయాక కొంత పట్టుదల తగ్గింది. యథాప్రకారంగా లక్ష్మాయి తోటలోకి వస్తూ ఉండడమూ చిన్నచిన్న పనులు చేసిపెట్టడమూ జరుగుతూ వచ్చింది. మొగవాళ్లుంటే వాళ్లున్నవైపు వెళ్లడానికి వీలు లేదని మాత్రం వీరన్న లక్ష్మాయిని కట్టుదిట్టం చేశాడు.

నాలుగైదు వారాలలోనూ ఒకనాటి విశేషాలు వీరన్న మనసులో బాగా నాటుకుపోయాయి.

వెంకయ్యగారు సాముద్రికశాస్త్రంగురించి ఆయన చుట్టం ఎవరో పుస్తకం వ్రాస్తే, ఆ పుస్తకం చదువుతూ, రోజూ మధ్యాహ్నం నిద్రలేచి, కాఫీలో కొబ్బరిసిల్లో అందరూ తాగడం అయాక, సావకాశంగా అందరినీ చుట్టూ చేరదీసి అందరిజాతకాలూ చెప్తూవచ్చేవా డాయన. ఒక నాడు ఆయన ఈవిధంగా కాలక్షేపం చేస్తుంటే వీరన్న కూడా పక్కని కూర్చుని ఆనందిస్తున్నాడు.

వెంకయ్యగారు సుందరరామయ్యగారి రెండో అబ్బాయి వెంకటాద్రి చెయ్యి పరీక్షచేస్తున్నాడు.

"ఏమిటి అంతదీక్షగా పరీక్షచేస్తున్నారు, మామ గారూ?" అన్నాడు వెంకటాద్రి.

"నీ చిటికినవేలోయి" అన్నాడు వెంకయ్యగారు.

"చిటికినవేలున కూడా సాముద్రికంలో అవసరమైన రేఖ లున్నాయా?" అని అడిగేడు వెంకటాద్రి.

"రేఖలకోసం కాదు...ఆ రేఖలుకూడా చూడాలి. ...అది కాదు. ఈ వంకరచిటికినవేలు రెండుచేతులకీ కూడా ఉన్నట్టేనా?" అని అడిగే డాయన.

"రెండుచేతులకీను. మా అందరికీ అంతే."

రెండు వంకరచిటికినవేళ్లూ పరీక్షగా చూసేడు వెంకయ్యగారు.

సుందరరామయ్యగారి పెద్దఅబ్బాయీ, మూడో అబ్బాయీ కూడా దగ్గరగా జేరి, వాళ్లకికూడా రెండుచేతులకీ వంకర చిటికినవేళ్లేనని చూపించారు.

"వీరఘంటలవారి కందరికీ వంకర చిటికినవేళ్లే నన్నమాట" అన్నాడు వెంకయ్యగారు.

"మా ఇద్దరబ్బాయిలకీ, అమ్మాయికీ కూడా వంకర చిటికినవేళ్లేనండీ" అంది సుందరరామయ్యగారి పెద్దకోడలు. మా రెండోఅబ్బాయికి మరీ చక్కగా విల్లువంచినట్లుంటా యా వేళ్లు!

"నీపిల్లల్ని ఇలా తీసుకురా" అన్నాడు వెంకయ్యగారు.

చిటికినవేళ్లకి చక్కని వంకర ఆ పిల్లలందరికీ.

ఇంతట్లో సుందరరామయ్యగారు కూడా వచ్చాడు.

"వియ్యంకుడిగారికి కూడా వంకరచిటికినవేళ్లేనా?" అని అడిగేడు వెంకయ్యగారు.

"మాకుటుంబంలో అందరికీ వంకర చిటికిన వేళ్లే నండీ" అన్నాడు సుందరరామయ్యగారు, తన చిటికినవేళ్లు చూపిస్తూ. "మా పిల్లలందరికీ చూడండి. మా పెద్ద బ్బాయికొడుకులకీ కూతురుకీ, మా రెండోవాడి కూతురికి కూడాను. కాని దానికంత స్పష్టంగా లేదు. లేకపోలేదు లెండి. నా కూతురికిమాత్రం సుందరికి ఆవంకర లేదు. మళ్లీ సుందరి కొడుక్కి వంకరచిటికినవేళ్లు తయారయాయి."

"మా మనమరాలికి వంకరవేళ్లన్న సంగతి ఈరోజు వరకూ నాకు తెలియనే తెలియదు, బావగారూ!" అన్నాడు వెంకయ్యగారు. అని, "వీరఘంటలవారి రక్త సంబంధం ఉంటే చాలునన్నమాట వంకరచిటికినవేళ్లు ప్రత్యక్షం అవడానికి" అన్నాడాయన.

ఈ హడావిడిలో అందరూ ఎవరి చిటికిన వేళ్లు వాళ్లు పరీక్ష చేసుకుంటుంటే, వీరన్న కూడా తన వేళ్లు చూసుకుంటున్నాడు.

"నీకు కూడా వంకర చిటికిన వేళ్లున్నాయేమో నని చూసుకుంటున్నావా ఏమిటోయి, వీరన్నా?" అన్నాడు సుందరరామయ్యగారు.

"లేదు, బాబూ! అందరూ చూస్తుంటే నేనూ చూస్తున్నాను" అన్నాడు వీరన్న.

"వీరన్న చెయ్యి చూసి అతనిజాతకం కూడా చెప్పాలి ఈ గ్రంథపఠనం పూర్తయాక" అన్నాడు వెంకయ్యగారు.

"చిత్తం, బాబూ" అన్నాడు వీరన్న.

ఇది జరిగిన పదిపదిహేను రోజుల లోపుగానే వీరన్నకి పూర్తిగా మనసు చెదిరిపోయే పరిస్థితులు ఈ విధంగా ఏర్పడ్డాయి.

తోటలో బంగాళాకి నాలుగైదువందల గజాల దూరంలో వీరన్న ఒక తాటాకులకొంప కట్టుకున్నాడు. ప్రొద్దున్నే ఇంట్లో చద్దన్నం తిని వచ్చేసేవాడు. మధ్యాహ్నం సుమారు ఒంటిగంటవరకూ తోటలలోనూ, పొలాల లోనూ పనులన్నీ చూసుకుని ఈ గుడిసె చేరుకునేవాడు. సుమారు ఆవేళకే లక్ష్మాయి వీరన్నకి తిండి తెచ్చిపెట్టేది. ఒకరోజున వీరన్న ముందువచ్చేవాడు; ఒకరోజున లక్ష్మాయి ముందువచ్చేది. వీరన్న ముందుగా వచ్చినట్టయితే లక్ష్మాయి

వచ్చేవరకూ ఒకమూల పడుకునేవాడు—అయిదు నిముషాలైనా, పది నిముషాలైనా కూడా. లక్ష్మాయి ముందు వచ్చి నట్టయితే పయినసుంచుని వీరన్నకోసం కాచుకుని ఉండేది.

ఈరోజున వీరన్న అంతమరీ తొందరగా రాలేదు కాని, లక్ష్మాయి గుడిసెబయట కాచుకుని లేదు. వీరన్న వచ్చే మార్గాన్ని ఎంతోదూరానికి కనిపిస్తుంది గుడిసె. ఇంకా లక్ష్మాయి రాలేదు కాబోలనుకున్నాడు. ఇంతలో మళ్లీ లక్ష్మాయి గుడిసెలోంచే బయటికి వచ్చింది—వీరన్న వస్తున్నవైపు కాకుండా మరొకవైపు పరీక్షగా చూస్తూ. లక్ష్మాయి బయటికి వచ్చిందోలేదో లక్ష్మాయివెంట సుందర రామయ్యగారి మూడవఅబ్బాయి సుబ్రహ్మణ్యంకూడా బయటికి వచ్చాడు. లక్ష్మాయి వీరన్నని చూడలేదు. సుబ్రహ్మణ్యం లక్ష్మాయి బుజంమీాద ఒకచెయ్యి వేసి మరొకచేత్తో నడుము పట్టుకోబోతున్నాడు. లక్ష్మాయి వెనక్కి తిరిగి చూసింది. వెనక్కితిరిగి చూడడంలో వీరన్న కనబడ్డాడు. కెవ్వున కేకవేసింది. సుబ్రహ్మణ్యంకూడా వెనక్కితిరిగి చూసేడు. వీరన్నని చూడగానే ఒక్కఉపరుగు పరుగెత్తేడు తోటబంగాళా వైపు. వీరన్న అతనివెంట పరుగెత్తలేదు. లక్ష్మాయి ఏడుస్తూ నుంచుంటే ఎడాపెడా నూరుగుద్దులు గుద్దినట్టు బాదేసేడు. "వద్దోయి, వద్దోయి, నన్నెందుకు చంపుతావోయి, నే నేపాపమూ ఎరగనోయి" అంటూ ముద్దయి కూలిపోయింది. "రంకుముండా, లంజా" అంటూ, ఎక్కడలేని ఉద్రేకంతోనూ తొక్కి తంతున్నాడు.

వీరన్న లచ్చాయిని. లచ్చాయి నోటంట రక్తం కారుతోంది. పెద్దపెట్టున కేకలు వేస్తోంది.

కేకలు విని సుందరరామయ్యగారూ, ఆయన పెద్ద కొడుకూ పరుగెత్తుకుంటూ వచ్చారు.

"అదేమిటోయి వీరన్నా, సిగ్గులేదూ ఆడదాన్ని అలా కొట్టడానికి?"

"మీరు మాటాడకండి, బాబూ. దగ్గరకొచ్చారంటే ...మరక్కడే ఉండండి, బాబూ...రంకుముండ..."

"దైవసాక్షిగా నేనేమీ ఎరగను, బాబూ. ఆ అబ్బాయి ఇక్కడున్నట్టే నాకు తెలియదు" అంటూ మొర్ర పెట్తోంది లచ్చాయి, నోటినున్న రక్తం కొంగుతో తుడుచుకుంటూ.

"నోరుముయ్యి, లంజా."

"కొట్టకోయి, వీరన్నా...కొట్టేవంటే నిన్ను చంపేస్తాను" అన్నాడు సుందరరామయ్యగారు.

"ఎవరు లచ్చాయీ, ఎవరా అబ్బాయి? మావాడోవాడేనా?" అని అడిగేడాయన.

"నన్ను రక్షించాలి, బాబూ. నేనేమీ ఎరగను. ఏ పాపం చేసినదాన్ని కాను. ఆ అబ్బాయి గుడిసెలో దాంకున్నాడు కాబోలు. నాకు తెలియదు. కుండ కిందపెట్టుంచేనే ఎక్కడో చప్పుడైతే, బయట కొచ్చాను—ఆ అబ్బాయి మీద చెయ్యివేసేడు..."

"ఛీ, రంకుముండా."

"అదుగో, వీరన్నా!"

"లేదు బాబూ, లోపల ఇద్దరూ సరసా లాడుకుంటు న్నారు బాబూ, సరసాలాడుకుంటూ పైకొచ్చారు బాబూ!"

లక్ష్మాయి 'కాదు కాద'ని ఏడ్చింది. బంగాళాలో ఉన్న వాళ్లందరూ చుట్టూ చేరుకున్నారు, సుబ్రహ్మణ్యం తప్ప—

"ఏమిటి నాన్నా, ఇదంతా" అని అడుగుతున్నాడు రామచంద్రుడు వెంకయ్యగారిని.

సుందరరామయ్యగారి పెద్దకోడలు గుడిసెలోనుంచి కుండలో నీళ్లు తెచ్చి లక్ష్మాయికి తాగడానికి ఇచ్చింది.

"నీళ్లతో ముఖంకూడా కడుక్కో, పాపం" అం దావిడ.

ఇంతట్లో సుందరరామయ్యగారు "వాడేడీ, వెధవ! సుబ్రహ్మణ్యం ఏడీ?" అన్నాడు.

"బంగాళాలో లోపల తలుపువేసుకుని పడుకున్నారు మూలగదిలో" అంది వెంకటాద్రిభార్య.

"లాక్కురండి, ఇలాగ."

సుందరరామయ్యగారి పెద్దబ్బాయి వెళ్లేడు. అతను బయలుదేరిన కాసేపటికి వీరన్నకూడా బంగాళావైపు వెళ్ల బోతే, "అయ్యో, మరిదిగారిని ఏంచేస్తాడో వీరన్న" అంది సుందరరామయ్యగారి పెద్దకోడలు. రామచంద్రుడు కూడా పరుగెత్తేడు వీరన్నవెంట.

"ఆగు, వీరన్నా" అని కేకేసేడు సుందరరామయ్య గారు.

"నన్ను కొట్టకు. నాన్నా, కొట్టకు. నిజం చెప్తా" అన్నాడు సుబ్రహ్మణ్యం.

మళ్లీ కొట్టబోతుంటే వెంకయ్యగారూ, కోడళ్లూ ఆపేరు.

"చూడండి, మరి వెధవని, ఎటువంటి వెధవపనులు చేసి కుటుంబానికి అమర్యాద తెస్తున్నాడో...ఏం చేసేవో చెప్పు, వెధవా."

అప్పుడు చెప్పేడు సుబ్రహ్మణ్యం, మాటలకి తడబడుతూ, సందేహిస్తూ సందేహిస్తూ.

లక్ష్మాయి మధ్యాహ్నం ఈ వేళకి వస్తుందన్న విషయం తెలుసుకుని, అనేకసార్లు అనుకుని, ఈరోజున గుడిసెలో పాతమంచం వెనకాల చీకట్లో ఒకమూల తను దాంకునిఉన్నట్టూ, లక్ష్మాయికి ఈ సంగతి ఏమీ తెలియనట్టూ, లక్ష్మాయి తప్పు ఏమీ లేనట్టూ, చొరవ చెయ్యబోయేసరికి వీరన్న కనపడినట్టూ, తను బంగాళాకి పారిపోయినట్టూ ఒప్పుకున్నాడు సుబ్రహ్మణ్యం.

"నీ పని చెప్తానుండు" అన్నాడు సుందరరామయ్యగారు.

వీరన్నవైపూ, లక్ష్మాయివైపూ తిరిగి, "వీరన్నా, విన్నావుగా? లక్ష్మాయితప్పు ఏమీలేదు. ఇంటికి తీసుకుపో. చావబాదేసేవు, పాపం, లక్ష్మాయిని...ఈ వెధవమూలాన్న."

"ఇంటికి పద" అన్నాడు వీరన్న లక్ష్మాయితో, "ఎందుకు చూస్తావు? తర్వాతొస్తా. నువ్వు పద."

"తిండి తిన్నాక కుండ పట్టుకుపోతా" అంది లక్ష్మాయి.

*　　　*　　　*

రెండురోజుల తర్వాత సుందరరామయ్యగారు లక్ష్మాయి కొక కొత్త నూలుచీర బహుమతిగా ఇప్పించి, వీరన్నతో "లక్ష్మాయి చాలా మంచి పిల్లోయి వీరన్నా. అనవసరంగా అనుమానాలు పెట్టుకోకు" అనికూడా చెప్పేడు.

వీరన్నకిమాత్రం లక్ష్మాయిమీద అనుమానం పూర్తిగా పోలేదు. ఆరోజున తను కనబడేవరకూ ఊరు కున్నట్టయితే అంతవరకూ ఏమి జరిగినట్టనీ, ప్రతిరోజూ అబ్బాయి నిలా కలుసుకుంటున్నట్టే కాదాఅనీ అనేకసార్లు లక్ష్మాయిని హడావిడి చేస్తూవచ్చాడు. లక్ష్మాయిమాత్రం ఇంక ఏడుపులు మాని, పొమ్మంటే పుట్టింటికి పోతాననీ, ఆ అబ్బాయి చెప్పినదంతా విన్నాకకూడా అంత అపనమ్మకం పెట్టుకునే టట్టయితే తను వేరే ముష్టయినా ఎత్తుకుంటూ బతుకుతాను కాని వీరన్నతో కాపురం అబద్ధమనీ గట్టిగా చెప్పేసింది. లక్ష్మాయిఅంటే కొన్నికొన్ని సమయాలలో వీరన్నకి మళ్లీ పూర్తినమ్మకం, అపరిమితమైన ప్రేమాను. అపనమ్మకం హెచ్చినప్పుడల్లా కల్లుదుఖాణానికి వెళ్లి కాస్త తాగేసివచ్చి అల్లరిచేసి పడుకునేవాడు. కొన్నాళ్లకి తన అను మానాన్ని గురించి లక్ష్మాయితో మాట్లాడడం కూడా మానేసేడు.

ఇంతట్లోనే లక్ష్మాయి కడుపుతోఉందని తేలింది. ఒక్కసారిగా మళ్లీ అనుమానంలో పడ్డాడు వీరన్న.

